# హర్ హైనెస్

[నవల]

రచన:

ఋషభచరణ జైన్

అనువాదం:

గద్దె లింగయ్య




ఉమా పబ్లిషర్సు, విజయవాడ.

# హర్ హైనెస్

"డియర్, నాతోడు, అదంతా ఒక్క-గుక్క-లో పీల్చెయ్యకపోతే నే నూరుకోను."

'హుజూర్! నా అశక్తికి మన్నించాలి. తమ యీ దాసుడు ఏక్ దమ్మున తాగగలడా!'

'సాకీ! ఇది నా ఆజ్ఞ, నా ఆజ్ఞోల్లంఘనకు శిక్షేమిటో తెలుసా?'

'రాణీ సాహెబ్! మీ మాటకు జవదాటడానికి గుండెవరికుంది!'

'కాని, ఎదురాడితేనో?'

'అయితే మృత్యువే; కాని నా విషయంలో మాత్రం చాపుకంటె తమరు కళ్ళెర్రజేయటమే భరింపరానిది.'

హార్ హైనెస్ కిలకిల నవ్వి ఖాళీయైన గ్లాసును ముందుకు చాచింది. అతడతి వినయంగా తనగ్లాసు నందులో వొంపాడు.

'మరి నీకో?'

'నాకా హుజూర్? వేసిన మోతాదు చాలు. ఇక శ్రుతిమించకుండా యీ బానిసను అనుగ్రహించండి.'

రాణిబింకమూ బిగువూ తప్పింది. చిన్నపిల్ల మారాము చేసినట్టు అన్నది—

'అయితే మేం మాత్రం ఎందుకు తాగుతాము!

'తమరా - తమరింకనూ సగమైనా పుచ్చుకోందే! హుజూరువారు మరికొంచెం రుచిచూడకపోతే మజా ఏముంది?'

అతను మాట ముగించకముందే హర్‌హైనెస్ గ్లాసును పెదవుల కానించి మధువంతా పీల్చివేసింది.

సాకీ మళ్ళీ గ్లాసును సగంవరకు నింపి, సోడాబుడ్డినందు కోటానికి చెయిచాపాడు.

కాని ఆమె చె య్యడ్డంపెట్టి—'సాకీ! ఏమి టీ అన్యాయం, సోడా కలిపి నన్ను చిన్నపుచ్చుతావా?'

'కాదు హుజూర్! సోడా కలుపకపోతే మీ......'

మధ్యలో అందుకొని సాకీవంక వాల్చూపుల వయ్యారంతో చూస్తూ రెండు గుటకలకే హడలిపోవటానికి నేను సాకీనా!' అంది రాణి— 'తే, మాకు క ల్తీలేనిసరుకే కావాలి'

అతడు గ్లాసునైతే అందించాడు; గాని 'అరె, తోబా!' అనుకున్నాడు అంతరాత్మలో.

హర్‌హైనెస్ ముఖపద్మం వికసించింది. నవ్వుతూ అడిగింది—'ఏం! బేజారైపోతున్నావా ఏమిటి?'

సాకీ చేతులుజోడించి 'సర్కార్, తమ నిబ్బరం దారుఢ్యం నే నెరుగనా!...వహ్వా! ఇందులో బేజారవ్వటాని కేముంది?'

రాణీ సాహెబ్ స్వరం మార్చి 'హైరానుకు కారణమేలేదా?' అని అడిగింది.

సాకీకూడ వెంటనే శ్లేటుమార్చాడు. 'వాస్తవానికి హైరాను కావలసిందే; కాని తమబోంట్లుగాదు, నావంటి గులాములు.'

ఆమె ముఖంమీద దర్పం తాండవించింది. ఒళ్ళు విరుచుకుంటూనే సాకీభుజంమీద చెయివేసింది. ఆ స్పర్శతో అతడు పరవశుడై ఎరుపెక్కిన రాణీకన్నుల్లోకి అతి ఆప్యాయంగా చూచాడు. మెల్లగా ఆమె కరకమలమును తన భుజంమీదనుంచితీసి రెండుచేతులతో అదిమి పట్టుకున్నాడు. తర్వాత గుండె కదుముకొన్నాడు.

'నువ్వు నిజమైన ఆజ్ఞానువర్తివి సాకీ!' హర్ హైనెస్ ఒళ్ళువిరుపులతోను, అరమోడ్పుకన్నులతోనూ చూస్తూ అన్నది—'నీవే లేకపోతే నే నేమయేదాన్ని?'

'హుజూర్! నేను తమ దాసుణ్ణి. తమ రంతమాట అనవచ్చునా?'

'కాదు సాకీ, నిజంగా నేను నీకెంతైనాకృతజ్ఞురాలను. నీవే నన్ను జీవంతో నిల్పావు. నీ ఆసరాతోనే నేను బ్రతికి వున్నాను. మరి నీపై నమ్మకంతోటే జీవించివుంటాను.'

'రాణీజీ, రాణీజీ! నేను తమ బానిసను!'

'ఆ మాట అనవద్దు సాకీ; నీవు నా మిత్రుడవు. బానిస ఎన్నడూ ఈ సానుభూతి చూపనూలేడు; సేవ చెయ్యనూలేడు. చూడు సాకీ! నువ్వెంత ప్రేమాదరములతో, ఓర్పు, ధైర్యములతో నా పరుషవాక్యాలను భరించు

తున్నావు! ఎల్లప్పుడూ నాకు ముందూ - వెనకా-చుట్టూ నువ్వే కనిపెట్టుకొని తిరుగుతున్నావు. నా నిమిత్తమే సంస్థానంకూడా వొదిలిపెట్టి వచ్చావు. ఉద్యోగంకూడా వొదులుకొంటివి! ఏం, ప్రియా! ఇదంతా బానిసచేసే పనేనా?'

పెంపుడుకుక్కలాగున సాకీ రాణీసాహెబ్ ముందు తల వొంచాడు.

'ఆ నా స్వర్ణఘడియలు-సాకీ!- మళ్ళీ తిరిగివస్తాయా?' రాణి ఏదో తలచుకొని ఆకస్మికంగా వులికిపడినట్టన్నది— 'నిజంగా అవి నాకు స్వర్ణదినాలే! నీకు జ్ఞాపకంలేదూ? హిజ్‌హైనెస్ భ్రమరంలాగా ఝుమ్మంటూ నాచుట్టూ ఎలా తిరుగుతూండేవారు! వారిదాసదాసీజనం చేతులుకట్టుకొని నా కనుసన్నకోసం ఎదురుచూచేవారు. వారి రత్నాలరాసులు, నాణాలసంచులు వున్న ఖజానాకొట్లు నాకై తెరచుకుని వుండేవి. ఆ ఉన్నత సౌధములు, సుమసౌరభముల వెదజల్లే పూవాటికలు, ఆ మెత్తని మొఖమల్ సోఫాలు, రంగురంగుల విద్యుద్దీపాలు, పంఖాలు—ఇవేమీ జ్ఞాపకంలేవా నీకు సాకీ?'

'మరువగలనా హుజూర్! అన్నీ జ్ఞప్తికున్నవి.' అన్నాడు సాకీ నిట్టూర్పు వదలుతూ—'కాని యిప్పుడవన్నీ తలచుకొని ఏం లాభం?'

'నిజమే, నిజమే. ఇప్పుడు వాటిలో నా మనస్సును రంజింపగల్గిన దొక్కటీ లేదు. వాటిలో ఆ శక్తే వుండివుంటే స్వయంగా వాటిని కాల్దన్ని ఎందుకు వస్తాను?' అన్నది.

హర్ హైనెస్— 'ఆనాడే – హిజ్ హైనెస్ వారిచిత్తం పరాయత్తమైననాడే – శ్రీవారికి మళ్ళీ పెళ్ళిమోజు కల్గిననాడే – పండువంటి నా సంసారం వల్లకాడయింది. ఇంకా అక్కడ నా కేమున్నది సాకీ ?'

'అంతా మీదే హుజూర్!! మీ హక్కును ఎవరూ తొలగించలేరు. మీరు స్వస్థానంలో ప్రవేశించే రోజు త్వరలోనే వస్తుంది.'

'ఆరోజు ఎన్నటికీ రాకూడదనే నా కోరిక. మళ్ళీ ఆ అంతఃపురంలో కాలుపెట్టటంకంటె యింకా అవమానమేముంది నాకు? కాని, సాకీ, నా కిప్పుడు ఖర్చులకు పైకం కావాలి. అంతకు మించి నా కింకే కోరికా లేదు... ఒకటొకటిగా నా వొంటిమీది నగలన్నీ అమ్మివెయ్యటం నువ్వా చూస్తూనేవున్నావు. A. G. G. నాకేమీ సాయం చెయ్యలేకపోయాడు. మరి నేనుగాపోయి వైస్రాయిని దర్శించటం జరిగే పనికాదు. ఇప్పుడు నే నేం చెయ్యాలి? డబ్బులేందే డుబ్బుకు కొరగాము. హోటలుబిల్లు వేలు దాటింది; ఇక్కడి నుంచి అసలు బయటపడేదెట్లా? ...హిజ్ హైనెస్ వస్తున్నారు, పోతున్నారు. కాని వారికి నావూసే పట్టటంలేదు.'

సాకీ కళ్ళలో నీరు కమ్మింది. నోట మాట పెగల్లేదు. మెల్లగా గొంతు సవరించుకొని 'విచారించకండి హుజూర్! తమరు యిక్కట్టులన్నీ గడిచి గట్టెక్కేరోజు వచ్చితీరుతుంది' అన్నాడు.

'అయ్యో! ఎప్పుడది వచ్చేది?'

'నిరాశ చెందకండి, ఓపికపట్టండి.'

'నువ్వెంత మంచివాడవోయ్ సాకీ, యెంత మంచి వాడివి !'

హర్ హైనెస్ ఆవేశంతో కుడిచేతిని ముందుకుచాపింది. సాకీ ఆ హస్తాలను ప్రేమాదరాలతో స్వీకరించి ముద్దెట్టు కున్నాడు.

'ప్రియా! ప్రియతమా!' అన్నది ప్రేమార్ద్ర కంఠ స్వరంతో, మత్తులూరించే మాటలతో రాణి—'నువ్వే నా చెలివి, సఖుడవు— తోడునీడ - నా సంరక్షకుడవు.'

'నేను మీ అధమ సేవకులలో ఒకణ్ణి హుజూర్!' కైపెక్కిన నిషాలో తొలగిన పయ్యెదనైనా గమనింపని యీ తొయ్యలిపైకి ఉజ్వలానందజ్యోత్స్నాపూరితాలైన కటా క్షాలు ప్రసారించుచు సాకీ అన్నాడు—'తమరు నా యోగ్య తకు మించిన గౌరవాదరాలు చూపుతున్నారు. కృతజ్ఞతతో ఆ జన్మాంతం తమ దాసుడనై వుండి ధన్యుడనౌతాను.'

'నావంటి పరిత్యక్తకు—అవును, యిప్పుడు నేను పనికి మాలినదాననే—పతితనే - సేవకుడవైతే ఎన్నికష్టాలు యెదుర్కొంటవో యెప్పుడైనా ఆలోచించావూ? ఆ ఆపద లన్నిటినీ అనుభవించటానికే సిద్ధమయ్యావా సాకీ?'

అతడు గుండెమీద చెయ్యేసుకొని గొప్ప వీరుడిలాగ 'మీకోసం యీ దాసుడు దేనికైనా తయారే' నన్నాడు.

'సెభాష్, సెభాష్!'

'హుజూరువారింక విశ్రాంతి గైకొనటం మంచిది.'

నువ్వు కాస్సేపా 'హుజూరు'ను వదలి పెడుదూ. నా ప్రాణప్రియుడవు నీవలా సంబోధించుతూ వుంటే నాకు కర్ణ కఠోరంగా వుంది.'

'అయితే మరి తమర్ని ఏమని పిలవమంటారు రాణీ సాహెబ్!'

'నీవా? నువ్వు నన్ను 'అందాల రాణీ' అనో, 'ముద్దుల గుమ్మా' అనోపిలవరాదూ! ప్రియురాలినిపిలవటమే చేతకాదా?'

'యువర్ హైనెస్ ... ...'

'మళ్ళీ అదేనా? ... ప్రేయసీ అని పిలువు, ప్రేయసీ అని ... ప్రియా! నాదగ్గర నీకంత భయమెందుకు? నేను నిన్నెంతగా ప్రేమిస్తున్నాను! డియర్, నా ప్రేమ నాకట్టి ఆదరించవేం నువ్వు? నీది పాషాణహృదయమా ఏమిటి సాకీ?'

'హుజూర్, తమరు చాల అలసిపోయారు. ఇక పరుంటే మేలు.'

'విశ్రాంతా? ఆఁ, విశ్రమిస్తాను ... ఏదీ యిటువచ్చి లేవదియ్యి, వెళ్దాం.'

సాకీ ఆమె నడుంచుట్టూ చెయ్యేసి లేవదీశాడు. రాణి తల నతని భుజంమీద ఆనించింది. అత డామెను మెల్లగా తీసుకొనివెళ్ళి పక్కమీద పండుకోబెట్టాడు. ఆమె బాహులత అతని కంఠాన్ని పెనవేసుకుని వున్నది. మితిమీరిన నిషాతో కైపెక్కి ఉన్న ఆ మదవతి—హార్ హైనెస్—బాహు పాశంనుండి ప్రయత్నించి కూడా విడివడలేకపోయాడు సాకీ

# 2

ఆమె మూడు పదులు నిండని జవ్వని. పసిడి నిగ్గుల దేలు బంగారు ఛాయ. దృఢమైన శరీరం. వాగడేసికన్నులు. వాటిక్రింద ఎడతెగని సురాపానంచేత ఏర్పడ్డ నల్లని రేఖలు. కుంతలాలు నిడుపై నునుపుతేలినవి. ఆమె ఆకారంలో–నడకలో – మాటల్లో – ప్రవర్తనలో అన్నింటను రాణియే.

అతడొక అందమైన యువకుడు. హర్ హైనెస్‌కు బానిసనని తానే చెప్పుకుంటాడు. ఇరవైయారేండ్ల ప్రాయముంటుంది. అచ్చుపోసిన పోత విగ్రహంలాంటి మనిషి. ఉక్కుముక్కవంటి శరీరం. గౌరవర్ణ ముఖం. తేనెలూరు వాక్కు. అన్నివిధాలా అందగాడు.

హర్ హైనెస్‌కు బానిసనని చెప్పుకుంటూ ఆమెను పరవశత నొందించిన దితడే. 'ప్రేయసీ' అని పిలవమని పదే పదే ఆజ్ఞాపించబడినవా డితడే. మధుపాన మత్తతచే అచేతనావస్థకు లోనై సిగ్గు – బిడియాలు వీడినరాణి బిగి కౌగిలిలో చిక్కి, ఢిల్లీపట్టణంలోని ఒక పెద్ద హోటలుగదిలో మన్మథ సామ్రాజ్యాన్ని ఏలిందీ ఇతడే.

వేకువఝామున నాలుగుగంటలు టంగ్ టంగుమని అప్పుడే వినపడినై. ఆమె మైమరచి నిదురిస్తున్నది. తన మెడను పెనవైచుకొని ఉన్న యామె కుడిచేతిని మెల్లగ తొలగించుకుని లేచాడు సాకీ. విడివడ్డ రవికను, తొలగిన చీరను అతి జాగ్రత్తగ సర్ది పిల్లి అడుగులతో గది వెలుపలికి

వచ్చాడు. నౌకరును పిలిచి ఏదో మెల్లగా చెప్పి, గబగబ క్రిందికి దిగాడు. హోటలు కెదురుగానే టాక్సీ స్టాండువున్నది. చేసైగతోనే న్యూమోడల్ టాక్సీ ఒకటివచ్చి అతని ముందాగింది. మెదలకుండా అతడందులో ఎక్కి కూర్చున్నాడు.

వేసవికాలం. తెల్లవారవచ్చింది. అలాంటి సమయంలో తీవ్రకాంతిని దేదీప్యమానంగా ప్రసరింపజేస్తూ ఢిల్లీ నగరవీధులగుండా టాక్సీ పరుగెత్తిపోతోంది. తలపై టోపీ గాని, పాగా గాని లేనందున కారువేగమువల్ల వచ్చే గాలి విసురుకు అతని క్రాఫు దోబూచులాడుకొంటోంది. చొక్కా గుండీలు ఊడిఉన్నై. పాజామాకుఅక్కడక్కడా ఏవో మరకలున్నవి. అప్పటి ఆ చీకట్లో అతని కవేమీ కన్పించటంలేదు. అసలు గమనించాలన్న దృష్టి లేదు అతనికి.

నూతన నిర్మాణానికి నమూనా అనదగు ఒక దివ్య హర్మ్యంముందు టాక్సీ టక్కున ఆగింది. సాకీ క్రిందికిదిగి చరచర ద్వారంవద్దకు వెళ్ళాడు. 'నేను వచ్చానని మీ సేట్‌జీతో చెప్పు' మని అతడు ఒక బెంచిమీద కూర్చుండి కునికిపాట్లుపడుతున్న గూర్ఖావాడితో అన్నాడు.

వాడు సాకీని క్రిందినుంచి పైదాక ఒకపర్యాయం చూచి నమస్కారం చేసి వెళ్ళిపొయ్యాడు.

మరుక్షణంలోనే తిరిగివచ్చి 'పదండి, తమర్ని దయ చెయ్యమన్నారు.' అని చెప్పాడు గూర్ఖా.

ఢిల్లీ సేట్‌జీలైనా మామూలుగా మేలుకొనివుండే సమయంకాదు అది; కాని ఆ సేటు తెల్లవార్లూ సాకీ నిమి

త్తమే జాగారంచేశాడో, లేక అస లా నా డతనికి నిద్రించ వలసిన అగత్యమే కలుగలేదో, సాకీని చూడగానే లేచి ఎదు రొచ్చి కరస్పర్శచేసి అతన్ని కూర్చుండబెట్టాడు.

'పన్నెండు గంటలు దాటగానే తమ రిక దయచేయ రనుకున్నాను. అంతలో మరో పెద్దమనిషి వచ్చారు. ఆయన్ను సాగనంపి పడుకుందామనుకుంటూ ఉండగానే తమరాక తెలిసింది.'

'మిమ్ము శ్రమపెట్టినందుకు మన్నించాలి. నేను వేరే పనిలో నిమగ్నుడనై వుంటంవల్ల ఎంత ప్రయత్నించినా అనుకున్న వేళకు రాలేకపోయాను' అన్నాడు సాకీ మర్యాద సూచకంగా.

సేట్ జీ పళ్ళు బయటపెట్టి యికిలిస్తూ 'అవునవును, తమకు బోలెడన్ని పనులు. అనుకున్నట్టు జరుగుతుందంట లెండి!' అన్నాడు.

విచారవదనంతో సాకీ జవాబిచ్చాడు—'పనేమిటి సేట్ జీ! పెద్ద బరువెత్తుకున్నాను. ఆమెస్థితి తలచినా, చూచినా గుండె బేజారై పోతోంది.'

సేట్ జీ సానుభూతితో కరిగి నీరైపోయిన ట్టభినయించి —'జీవితం హెచ్చు - తగ్గుల నీడ సార్! ఏంచెప్పను? నా మట్టుకు నేను ఆమెగారిని గురించి ఎంతగానో విచారపడు తూంటాను. అయితే రోజు లలాంటివి. మీరేంజేస్తారు, నేనేం జేయగలను, చెప్పండి.' అన్నాడు.

సాకీ పెద్దగా నిట్టూర్చి 'ఇల్లాంటి ఆపద ఎవరికీ రాకూ డదు.' అన్నాడు.

'ఎవరికీ - ఎవరికీ రాకూడదు సార్' అని వత్తి పలికాడు సేట్.

సాకీ ఏదో అడగాలనుకుని మళ్ళీ తటపటాయించి వూరుకున్నాడు.

'అయితే, ఏమండీ! రాజాగారి వ్యవహారం ఎలా వున్నట్టు?'

'మహారాజాగారా?' వేడిసిట్టూర్పు మరోసారి వదుల్తూ సాకీ అన్నాడు—'దేవుడాయనకు దీర్ఘాయువు నిచ్చుగాక!'

'సంస్థాన బొక్కసం ఖాళీ అయిందనుకుంటున్నారే! కాతాలుపెట్టిన షాహుకార్లకు తోంటచెయ్యి చూపుతున్నారనీ, ఒకొక్కళ్ళే సంస్థానం విడిచి పోతున్నారనీ పుకార్లు పుట్టినై. ఇదంతా నిజమేనా అండి?'

సాకీ ముఖం ఎర్రబారింది. 'ఏయ్, ఇక కట్టిపెట్టు. అనవసర ప్రసంగం చాలించు' అని మందలించాడు.

'క్షమించండి. తమకు కష్టంకలిగిస్తే క్షమించండి. మిత్రులుగా ఎంచి తమతో ఆవిషయం ప్రస్తావించాను. ఇంకెప్పుడూ ఆవిషయం తేను, మన్నించండి.'

సాకీ జవాబివ్వలేదు. ముఖంమీద తామసచిహ్నాలు మాత్రం మళ్లీ నిల్చివున్నై. 'మరి ఆవిషయం ఏమైంది?' అని తీవ్రంగా ప్రశ్నించాడు.

'తమపనా అండి, అయినట్టే... కాని అవనట్టు కూడాను.'

'అంటే?'

'అది జరిగేది కాదు సార్!'

'అయితే నా వస్తు విలా యిచ్చెయ్యండి.' అని చెయి చాచాడు సాకీ.

'అయ్యో బాబూ, తమవస్తువు ఇవ్వకేం జేస్తాను? అసలు నామాట పూర్తిగా వినండి.'

'ఏమిటి? చెప్పు?'

'ఆ వస్తువుకు తమరు సెలవిచ్చిన అంచనా చాలా జాస్తి సార్! నేనంత ధర పెట్టలేను. నేనే అన్నమాటేమిటి, ఎక్కడా ఎవడూ అంత విలువ ఇవ్వలేడంటే నమ్మండి.

'అలాగా!' సాకీ పెదవివిరచి అన్నాడు—'మీావృద్దేశంలో ఎంత చేస్తుందని?'

'తమ రాగ్రహిస్తారేమో?'

'ఇలాంటి వ్యవహారాల్లో నా కెప్పుడూ కోపంరాదులే'

'నేను దానికెట్టి పరిస్థితిలోను రెండువేలకంటె ఎక్కువ ఇవ్వలేను సార్.'

'రెండు వేలా!'

'అవును సార్, రెండువేలు, నిండా రెండువేలు.'

సాకీ ఆలోచనలోపడ్డాడు.

'తమకు కోపంవచ్చిందా అండి?' అన్నాడు సేట్. సాకీకి కోపం రాలేదు; కాని వ్యాకులత హెచ్చింది.

'రెండువేలు చాల తక్కువే సేట్‌జీ. దానికి ఆరువేల అయిదువందలు నా చేతుల్తోనే ఇచ్చాను. కొసరెండేళ్లైనా కాలేదు.'

సేట్ కృత్రిమ నవ్వునవ్వి అన్నాడు—'బాబూ ఒక సంగతి మనవి చెయ్యనా?' సాకీ ముఖకవళికలను పరిశీలనా దృష్టితో గమనించి 'తమబోటి శ్రీమంతులవల్లనే మేము నాలుగురాళ్లు సంపాదించుకుంటామనే విషయం మరువకండి. మన సంబంధం యీనాటిదికాదు. అందువల్ల నేను తమవద్ద స్వల్పలాభం మాత్రమే చూచుకుంటాను. ఇక అసలు రహస్యం చెబుతా వినండి. సర్వసాధారణంగా వ్యాపారులు ఒకటికి రెండూ—మూడూ కలపందే రాజాధిరాజులతో బేరంచెయ్యరు. అలాంటప్పుడు అసలీ వస్తువు విలువ ఎంతుంటుందో తమరే వూహించండి.'

సాకీ ముఖం మరింత మ్లానమైంది. సేట్‌తో వాదించటం ఆతని కేమాత్రం ఇష్టంలేదు. ఒకక్షణ మాలోచించి 'అంతకంటె ఎక్కువేమీ యివ్వలేరా సేట్‌జీ?' అని అడిగాడు.

సేట్ తక్షణమే ప్రక్కనున్న యినుపమందసాన్ని తెరిచాడు. ఒక చక్కని నగల కేసునుండి మిలమిల మెరిసే కంఠహార మొకటి తీసి సాకీముందు పెట్టాడు.

'తమ రాగ్రహిస్తే చెప్పలేను; కాని నేనూ రాణీ సర్కారువారి సేవకుడనే. శ్రీవారికి నేను రెండువేలు నజరానాగా యిచ్చుకుంటాను. తమరీ పైకమూ, వస్తువూకూడ తీసుకువెళ్ళి వారికివ్వండి.' అంటూనే చకచకా చెక్కుబుక్కుతీసి రెండువేల రూపాయలకు చెక్కువ్రాసి అందిం

చాడు. సాకీకి ఆలోచన పోలా మారుమాట లేకుండానే తట పటాయిస్తూ తుదకు చెక్కు నందుకున్నాడు. గత్యంతరంలేక అంతతోనే తృప్తిపడి లేచాడు.

ఈవిధంగా అంత విలువగల హారం అయినకాడికి అమ్మవలసొచ్చింది.

# 3

'యువర్ హైనెస్, హోటలు వెధవలు పెద్ద రగడ చేసేశారు.'

'అంటే ?'

'బిల్లు పూర్తిగా చెల్లించనిదే 'కదలనివ్వ' మని నిల వేశారు. పైగా పోలీసుకు 'రిపోర్టు చేస్తామ'ని కూడా దబా యించారు.

'మరి ?'

'ఆ రెండువేలరూపాయిల చెక్కును వాళ్ళ ముఖాన వేసి బయటపడ్డాను.'

'ఇప్పు డెలాగు సాకీ ?'

'నాకూ ఏమీ పాలుపోవటంలేదు. టికెట్లూ లేవు. ప్రయాణఖర్చులకు చిల్లిగవ్వలేదు... బండి బయలుదేరటాని కింకెంతో టైములేదు. ఎరిగినవా రెవరైనా కనిపిస్తారేమో ననుకుంటే ఆ ఆశా తీరింది.'

హర్ హైనెస్ గాభరాతో లేచి నిలబడింది.

'అయితే దిగిపోదాం పద' అంది.

'దిగిమాత్రం ప్రయోజనం ఏమిటి? చేతిలో కానీ లేదు. హోటలువాళ్ళతో పేచీ రానేవచ్చె. మరో హోటలుకు పోదామనుకున్నా మనసంగతి యీవరకే అల్లరయిపోయింది. అదీగాక యింతసేపూ కూర్చుని యిప్పుడు దిగిపోవటంమాత్రం ఏమంత బాగుంటుంది?'

ఆమె ఆలోచనలోపడింది.

'ఇక టైమెంతో లేదు' అని సాకీ హెచ్చరించాడు.

'ఏమిటి?'

'బండి కదిలే టైమయింది హుజూర్. సామానింకా బయటేవుంది. ఏది ఏమైనప్పటికి మనం వెళ్ళితీరవలసిందే. నేనుపోయి పెట్టే - బేడా రెండోతరగతి కంపార్టుమెంటులో పెట్టిస్తాను' అంటూ, పోయి సామాను సర్దించాడు. అంతలో కూతవేసి బండి కదిలింది.

హర్‌హైనెస్ మొదటితరగతి పెట్టెలోనుంచి తల బయటికి పెట్టి సాకీవైపు చూసింది. అతడూ తన పెట్టెలో నుండి మెడసాచి చేసన్నతో ఆమెకు ధైర్యంచెప్పాడు.

చీకటిపడింది. గాఢాంధకారంలో మింట చుక్కలు మిల మిల మెరుస్తున్నాయి. రైలుబండి పొగలు కక్కుతూ, నిప్పురవ్వలు చెరుగుతూ, రొప్పుతూ రోజుతూ అతివేగంగా పరుగెడుతోంది. అది మరుసటి ఉదయానిగ్గాని గమ్యస్థానం చేరుకోదు.

ఆ పెట్టెలో హర్‌హైనెస్ ఒక్కతే వుంది. వెనక దిగబడిపోతున్న ఢిల్లీనగరాన్ని చూస్తూ నిశ్చింతగా నిర్మల

వాయువు పీల్చింది. ఆమె గమ్యము సిమ్లానగరము. ఆమె లేచి తలుపుకు తాళంవేసి, జోడువదలి బెర్తుపైన విశ్ర మించింది.

అనా డామెకు తగిన మోతాదు పడింది కాదు. మనస్సు వ్యాకులతచే సంక్షుభితమైవుంది. ఒంటరితనం మరింత వేధించ సాగింది... గతించిన మంచిరోజులు స్మృతిపథంలో గోచ రించినై. తనకోసం స్పెషల్ ట్రెయిన్లు బయల్దేరటమూ, వెంట డజన్ల కొద్దీ దాస-దాసీలు ప్రయాణించటమూ, ఒకటొకటిగ ఎన్నో తలపుకొచ్చాయి. వెంటనే—తనతో ఒక దాసీగాని, నౌకరుగాని లేకుండడం, కనీసం తనకు టిక్కెట్టయినా లేక పోవటం తలచుకొని విహ్వలహృదయ అయింది. తెల్లవారితే ఖర్చులకు మార్గమేమిటా అనుకున్నప్పు డామె నిలువునా కంపించిపోయింది.

ఒక చిన్నస్టేషనులో బండి ఆగింది. తలుపు తట్టిన చప్పుడు ! క్రమంగా తీవ్రమయింది. కిటికీలన్నీ అంతకు పూర్వమే మూయబడి వున్నై. పంఖా నిర్విరామంగా ఏక ధాటిని తిరుగుతోంది. తలుపుపైన పడుతున్న గుద్దులధ్వని వింటూ ఎంతోసేపు కూర్చొనివుండలేకపోయిం దామె. కిటికీ తెరచిచూసింది.

ఆమెగుండె గుభేలుమన్నది ! కిటికిగుండా బయటికి పడుతున్నది వెలుతురు – ఆ కాంతిలో ఒకచేత లాంతరు పట్టుకొని, రెండోచేత్తో తలుపు తట్టుతున్న గార్డు కళ్ళ బడ్డాడు. అతని వెనుక దొరవేషంలోవున్న ఒక వ్యక్తినీ

సామాను ఎత్తుకొనివున్న కూలీ లిద్దరినీ చూచిన తర్వాత మాత్రం ఆమెదడ కొంతవరకు తగ్గింది.

'దయచేసి తలుపు తెరవండి' అన్నాడు గార్డు వినయ ముట్టిపడేటట్లు.

తలుపు తెరువక తప్పిందికాదు. ఆ స్టేషనునుండి ఒక పెద్దమనిషికి రిజర్వుచేయబడ్డ పెట్టెలో తా నెక్కి-ఉన్నట్లు అప్పుడు గ్రహించిం దామె.

'దయచేసి తమరు మరోకంపార్టుమెంటులోకి వెళ్ళండి. తమకూడా ఎవరూలేరా?' అన్నాడు గార్డు.

'నా కార్యదర్శి వస్తున్నాడు.'

'ఆయన ఎక్కడున్నారు ?'

'రెండోతరగతిపెట్టెలో'

'తమకు సహాయం నిమిత్తం పిలతునా ?'

'మీా దయకు వందనాలు.'

గార్డు సెకండుక్లాసుకంపార్టుమెంటువైపుకు నడిచాడు. కొత్తగా వచ్చిన ప్రయాణికుడు తన పెట్టె, పరుపు వగైరా సామాను లోపలపెట్టించసాగాడు. లోపల అడుగుపెట్టగానే అతని కన్నులు జిగేల్మన్నవి. ఇద్దరిచూపులూ కలిశాయి.

అతడు సిక్కు యువకుడు. ముఖంమీాద అరుణవర్ణం అతని దారుఢ్యాన్ని ధృవపరుస్తోంది. కన్నుల్లోని కాంతి, దుస్తుల ఫేషను అతని ఘరానాను వెల్లడిస్తున్నవి. అతను తన నిశితదృక్కులు సారించి హర్హైనెస్‌యొక్క అపూర్వ సౌందర్యసుధను గ్రోల ప్రయత్నించాడు.

'తమరుకూడా సిమ్లాకే దయచేస్తున్నా రనుకొం టాను.' అని పల్కరించా డా యువకుడు.

'అవును.' అని అతితీవిగా సమాధానమిచ్చింది రాణి.

అతడు ఆవలిస్తే ప్రేవులు లెక్కపెట్టగలదిట్ట. ఆమె మాటలోని దర్పంలో అంతర్భూతమైఉన్న ఉద్వేగాన్ని అతడు గ్రహించకపోలేదు. సామాను సర్దుకుంటూనే అనేక సార్లతడు పక్కచూపుల నామెపైకి విసిరాడు.

'మధ్యలో యిక్కడినుంచి మరోచోటుకు మారటం తమకు శ్రమ అనుకుంటాను.'

పెదవులపై చిరునవ్వును చిందులు తొక్కిస్తూ హర్ హైనెస్— 'కాని తమ కీ పెట్టె రిజర్వు చేయబడిందికదా!' అన్నది.

'అయితే ఏంలెండి. తమరు సందేహించకండి. బండి బయల్దేరబోతోంది. తమ రిక్కడే వుండండి. నేను నెక్స్టు హాల్టులో వేరేపెట్టెలోకి వెళ్తాలెండి.'

గార్డు తిరిగివచ్చి 'బహుశ నిద్రపోతున్నారేమో కనుపించలే'దని చెప్పాడు.

'అవును, పడుకొని వుంటా'రన్నాడు సిక్కు యువకుడు గార్డుతో 'మీదయకు థాంక్సు! మీరిక శ్రమపడనక్కర లేదు లెండి. వీరు నాకు పరిచితులే..మాలోమేము సర్దుకుంటాం లెండి.'

గార్డు మీ అభిప్రాయ మేమిటన్నట్టు హర్ హైనెస్ వంకచూశాడు; కాని ఆమె అయిష్టతయేమీ కనపరచనందున చక్కాపోయ్యాడు.

బండి వేగంగా పోతోంది. హర్‌హైనెస్‌ను కూర్చో మని చెప్పి తానూ కూర్చుని 'నా చొరవను మన్నించాలి. తమతో నా కింతకుపూర్వం పరిచయభాగ్యం లేకపోయినా గార్డుపీడ వదలించుకోవటానికి అలా అనేశాను. తమ రన్యథా భావించకండేం?' అన్నాడు యువకుడు.

ఆమె నవ్వుతూ 'యిందులో తప్పేముంది లెండి' అన్నది.

'ఏదీ, మీ పడక? ఈవైపున పరుస్తాను. వచ్చే స్టేషన్లో నే నెలాగూ వెళ్ళిపోతానుగదూ! తమరుకూడా శ్రమ పడటం ఎందుకు?'

'నా బెడ్డింగు నా కార్యదర్శివద్ద వుందిలెండి.'

'కార్యదర్శివద్దనా? బలే కార్యదర్శి! తమ రిక్కడ యాతనపడుతుంటే అతగా డక్కడ గుఱ్ఱుపెడుతున్నాడా!'

'పర్వాలేదు లెండి. వచ్చే స్టేషన్లో వచ్చి కలుసు కుంటాడు.'

'ఇప్పుడే నిద్రపోతూ వుంటే యింకా తర్వాత వస్తా డన్న నమ్మక మేమిటి?'

'కాదు, తప్పక వస్తాడు.'

'సరే!'

'తమ పరుపు పరుచుకోవటం మంచిది. ఇది మీ నిమిత్తమే ప్రత్యేకించబడింది కూడాను. ఎటికేట్‌కైనా నేనే మరోపెట్టెలోకి వెళ్ళాలిగద!''

''మీ రాలాగున భావించి నన్ను చిన్నపుచ్చకండి. రిజర్వు చేయించినంత మాత్రాన స్వంతమైపోతుందా?

మీలాంటి హైక్లాసు లేడీస్ విషయంలో ప్రిఫరెన్సు యివ్వడం మాత్రం ఎటికేట్ కాదూ?''కొంచెం సేపాగి మళ్ళీ అన్నాడు-

"తమరు అన్యథా తలచకపోతే చిన్న మనవిచేస్తాను."

"చెప్పండి, ఫర్వాలేదు."

"నేను పై బెర్తుమీద సుఖంగా పడుకోగలను. అభ్యంతరం లేకపోతే తమరు క్రింది సీటుపైన విశ్రమించవచ్చు. అట్లయితే మీరూ, నేనూకూడా యిబ్బందిపడి మరోచోటికి పోవలసినఅవసరండుండదు."

'ఓ! థాంక్యూ వెరీమచ్; అయితే నాకింక యిబ్బందేలేదు.'

## 4

అతడొక మెత్తనిరగ్గు, మల్లెపువ్వులాంటి దుప్పటితీసి ఆమెకు పడక నేర్పాటుచేశాడు. తర్వాత సూట్ కేసు తెరచి ఒక సీసా, రెండు గ్లాసులు, రెండు సోడాబుడ్లు తీసి బయట పెట్టాడు. 'క్షమించండి.' సీసామూత తీస్తూ అన్నాడు— 'ఈ దురలవాటు అభ్యాసమవటంవల్ల యింత వేడిలోకూడా వెచ్చదనం కావాలనిపిస్తోంది' నవ్వుతూ ఆమె ముఖభావాన్ని చదువ ప్రయత్నించాడు.

హార్ హైనెస్ కూడా అతని నవ్వులో నవ్వు కలిపింది.

'ఇందులో దోషమేముంది? ఈ యిరవయ్యో శతాబ్దపు నాగరికత కిది మెరుగు పెడుతుంది. నే నేమీ తప్పుగా భావించనులెండి.'

'థాంక్స్' అని అతడొక గ్లాసును ముందుకుజరిపాడు. రెండోదాన్ని తనముందుకు లాక్కున్నాడు. ఆమెనుంచి అభ్యంతరమేమీ రాలేదు. దొంగచూపులతో ఆమె నొక సారిచూచాడు. వాలకం అనుకూలంగానేవుందని పసికట్టాడు. గ్లాసులు రెండూ సగంవరకు నింపాడు. సోడా ఒకదాన్లో వొంచి రెండోగ్లాసులో పొయ్యబోతుండగా 'చాలు, చాల'ని ఆటంకపర్చింది హర్ మెజెస్టీ —

'నేను సోడా నతిస్వల్పంగా వాడుతాను' అంది.

అతని ఆశ్చర్యానికి మేరలేకపోయింది. తల పైకెత్తి ఆ విలాసినిని తేరిపార చూడసాగాడు.

'ఇప్పుడు నేను క్షమాపణ కోరుకోనా ?'

పులకింపజేసే చూపులు విసరుతూ, ముసిముసి నవ్వుతో అన్నది— 'సొసైటీలో మర్యాద నతిక్రమించటం నాకేమాత్రం యిష్టంలేదు. కృత్రిమలజ్జ, నటనలంటే నాకు అసహ్యం. నేను సోడా చాలాఅరుదు—అసలువాడనిదాన్లోనే జమ—గా వుపయోగిస్తాను. ఉన్నదున్నట్టు చెప్పివెయ్యటం మంచిదికదూ ?'

అతడు కొంచెం తెప్పరిలి అన్నాడు—

'అది గొప్పవారి లక్షణం. స్వీకరించండి.'

సోడాకలపనిగ్లాసు నందించాడు. కొంచెమాగి తన సూట్ కేసు నామెముందుకు తోశాడు. సంచిలోనుండి ఒక టిన్నుతీసి అందులో నిబతాణీలు కొంచెం టిన్నుమూతలోపోసి సూట్ కేసుమీాద వుంచాడు.

'వీటి నే టేబిలుగాను, ప్లేటుగాను భావించండి. తమ రి పేదమిత్రుని యింటికి అతిథిగా విచ్చేస్తే తమ ఘనతకు తగినరీతిని సత్కరించటానికి ప్రయత్నించేవాణ్ణి.'

హర్‌హైనెస్ గ్లాసులోవున్న పదార్థాన్ని మూడు వంతులు ఒక్క గుక్కలోనే పీల్చేసింది. గ్లాసును సూట్ కేసు -కాదు టేబిలు - మీాద పెట్టి కిలకిల నవ్వుతూ నాలుగు బఠాణీగింజలు నోట్లో వేసుకొన్నది.

'మీాకు చాలా చాలా అభినందనాలు. ఇప్పటికే ప్రయాణంతో బడలివున్న నాకు మీా యీా టెంపొరరీ టేబిల్ ముందు కూర్చుని ఆస్వాదించిన మధురసం, నమలుతున్న చిరుతిండి కలిగించిన మజా యింటివద్ద భోగవిలాసాలకంటె ఎన్నో రెట్లెక్కువైనది.'

'థాంక్స్!' అతడు ఆమెతో లిగుటక మోతాదును తలచుకొంటూ, ఆమె మదభరిత నయనగోళా ల్లోకి తన నిశితదృష్టి నిగిడ్చి 'తమ కీ కొద్దిపాటి ఆనందాన్నైనా చేకూర్చగలిగినందులకు ధన్యుడను... నిజంగా తమ రన్నట్లు ప్రయాణంలోవుండే రొమాన్సు యింటివద్ద నాలుగు గోడలమధ్య వుండే గొప్పతనంలో నామమాత్రానికైనా వుండదు.'

తానొక గుటకవేసి మళ్ళీ అన్నాడు— 'మిగిలింది కూడా పూర్తిచెయ్యండి. మరొకగ్లాసు పుచ్చుకుంటేనేగాని మనసు వికసించదు.'

ఆమె ప్రత్యుత్తరంగా గ్లాసును ఖాళీచేసింది. అతడు మళ్ళీ భర్తీ చేశాడు.

'మరి మీరో?' అతనిగ్లాసు సగమైనా ఖాళీకాకుండటం చూచి అడిగిందామె.

'తమరు కానివ్వండి; నేనూ పుచ్చుకుంటాను.'

ఆమె కనుబొమలు విరిచి 'మీరు నన్నవమానపరుస్తున్నారా?' అంది.

'ఎబ్బెబ్బె! అలాఅనకండి. మీ రావిధంగా తలుస్తున్నారా?'

'తప్పకుండాను.' అన్నది సీరియస్‌గా.

అతడు గ్లాసులోనిదంతా గుక్కతిప్పుకోకుండా తాగేసి 'ఇక సరా! మరి కోపంలేదుకదా?' అన్నాడు.

హర్‌హైనెస్ ఒక వెకిలినవ్వు నవ్వి 'మళ్ళీ పోసుకోండి' అన్నది.

అతను కొంచెం పోసుకొని సీసాకు బిరడా పెడుతున్నాడు.

'ఇంతేనా! ఇంకొంచెం వేసుకోండి.'

మరికొంచెం వొంచుకున్నాడు గ్లాసులోకి.

'ఇంకా'

అప్పుడతడు సీసా నామెచేతిలోనే పెట్టి 'మీకు తృప్తిలేకపోతే, మీచేత్తోనే పొయ్యండి.' అన్నాడు.

ఆమె అతనిముఖంలోకిచూచి 'ఏమిటి! మీ సత్తాయింతేనా?' అని అడిగింది.

తాగేవారి కింతకంటె అవమానంలేదు.

అతడు తప్పుకోటానికి 'కాదు, మీరన్నారుగదా అని. పురుషులకేం? ఎంతైనా భరిస్తాము.' అన్నాడు తెచ్చి పెట్టుకున్న బింకంతో.

'నన్నుగురించి మీరు సందేహించనక్కరలేదు.' అంది ఆమె బిగ్గరగా నవ్వుతూ.

'మీరు తృప్తిగా తాగండి. ఊఁ, తీసుకుని మీరూ పోసుకోండి.' అని సీసాను తిరిగి అతని చేతిలోనే పెట్టింది.

అతడు మూడింట రెండుపాళ్ళు సోడాకలిపి గ్లాసు నింపాడు.

ఆమెగ్లాసు మళ్ళీ ఖాళీ అయింది. అప్పటి కామె వాగ్ధోరణికూడా కళ్ళెంవదలిన గుఱ్ఱపుదౌడయింది.

'ఊఁహూఁ, మీరింకనూ ఖాళీచెయ్యనే లేదన్న మాట!' అతని గ్లాసువంక చూస్తూ అంది-'సరె, పోనివ్వండి; మరి యీవిషయంలో మిమ్మల్ని కదిలించను లెండి'

మారు మాటాడకుండా అత డామె గ్లాసు నింపాడు.

'ఏ స్టేషనిది?' బండి ఆగటం గ్రహించి అడిగింది.

'నాకూ తెలియదు. కిటికీ తెరచిచూస్తా నుండండి.'

'వద్దొద్దు. మీరు కూర్చోండి.'

తలుపుకు తాళం అదివరకే వేసిఉంది. పంఖా విరామంలేకుండా తిరుగుతోంది. విద్యుత్ కాంతి వారిద్దరి పైనా, పాలవర్ణపు పడకలమీదా, షాంపైనుతో నిండివున్న గ్లాసులపైనా ప్రసరించి విచిత్ర దృశ్యాన్ని సృష్టించుతోంది. మధురసాస్వాదనంచేస్తూ ఒకరి కొకరు జతకూడినందుకు

ఒండొరు లానందితులై, మధ్య మధ్య ఒకరిభావము లొకరు గ్రహించటానికి పరస్పరావలోకనము చేసుకుంటున్నారు.

తలుపువద్ద ఎవరో పిల్చిన చప్పుడు. 'హుజూర్'అన్న పిలుపు వినపడింది.

'ఓహో! నా కార్యదర్శి.'

'లోపలికి రమ్మంటారా?'

'నో, నో.'

'అయితే అతనితో ఏం చెప్పమంటారు?'

హర్ హైనెస్ చేసైగతో అతన్ని ఊరుకోమని కిటికీ తెరచి 'ఎవరు? సాకీ?' అన్నది.

'ఎస్, యువర్ హైనెస్!'

'ఏమిటి?'

'తమ బెడ్డింగు!'

'ఫర్వాలేదులే. ఇప్పుడేమీ అక్కర్లా. నీవుపోయి పడుకో; కాల్కాలో కలుసుకుందాం.' అని సాకీ ప్రత్యుత్తరానికైనా నిరీక్షించక చప్పున కిటికీ మూసివేసింది హర్ హైనెస్.

'యువర్ హైనెస్' అన్న సంబోధన సిక్కుయువకుని చెవుల్లో పడింది. నిశితదృక్కుల నామెపై పలుమార్లు ప్రయోగించాడు. ఆమెను గుర్తుపట్టటాని కెంతో ప్రయత్నించాడు; కాని ప్రయోజనం లేకపోయింది. మరి లాభంలేదని గౌరవపురస్సరంగా ఆమెనే అడిగాడు—'తమ పరిచయ భాగ్యం పొందవచ్చునా యువర్ హైనెస్ !'

'మళ్ళీ అదే సంబోధన! నాకామాట కర్ణకఠోరంగా వుంటుంది. నేను కేవల మొక సామాన్య స్త్రీ ననుకోండి. మీరు మన యీ ప్రయాణం కులాసాగా గడపాలనుకుంటే యిప్పుడూ—ఇంకెప్పుడూ నన్ను తెలిసికోటానికి ప్రయత్నించకండి. మనం కలిసి ప్రయాణంచేసిన సంగతికూడా తిరిగి ఎన్నడూ స్మరించనని మాటివ్వండి.'

హర్ హైనెస్ చేయిచాచింది. అత డామె కరకమలాన్ని చేతిలోకి తీసుకుని 'ఒట్టు వెయ్యాకపోతేనో?' అన్నాడు.

'అయితే యిక సీసామూత బిగించండి. నన్ను వేరే పెట్టెలోకి పంపివెయ్యండి.'

'అతడు నవ్వి 'అట్లయితే మీ మొదటి ఆజ్ఞకే బద్ధుణ్ని.' అంటూనే ఆమె మృదుహస్తాన్ని పెదవుల కానించుకున్నాడు.

## 5

'మీరు శ్రావ్యంగా పాడుతా రనుకుంటాను.'

అర్ధరాత్రి దాటింది. మరో బుడ్డికూడా కాళీ కావస్తోంది. హర్ హైనెస్ చెక్కిళ్లు ఎర్రబారినై. నిషా కండ్లలో తాండవమాడుతోంది. వొళ్ళు వేడెక్కివుంది.

అతను ముందుకు వంగి 'మీకు పాడటం రాదూ?' అని మళ్ళీ అడిగాడు.

అతనూ తాగుతూనే వున్నాడు. కాని శృతిమించి మాత్రం కాదు. అంచేతనే అతనికి స్పృహ తప్పలేదు.

'నాకా? నాపాట మీ కేం బాగుంటుంది?' అన్నది.

ఆమె నిరోధించటం వల్లనే అతడు 'యువర్ హైనెస్' అని సంబోధించటం మానివేశాడు. 'కాదు, మీరు పాడితే బాగానే వుంటుంది.'

'మీ ముఖం ఎంత అందంగా వుంది! మీ మాట లెంత మధురంగా వున్నై!' అన్నదామె అతనిమాట విని పించుకోకుండానే.

యువకుడు తలవొంచి కృతజ్ఞతను తెలిపాడు, తానొక హైక్లాసు లేడీ ప్రశంసకు పాత్రుడైనందుకు పరవశం చెందాడు. అతని హృదయం ఆనందంతో కుప్పిగంతులు వేయసాగింది.

'దేవిగారి కృపకు పాత్రుడ నైనందుకు ధన్యుణ్ణి.'

'ఓ! డియర్! పెద్ద పెద్దమాటలు వాడుతున్నారే! మీ మర్యాదను వదిలించటానికి మళ్ళీ మార్గం వెతుక్కో-వాలా?'

'మీ కయిష్టం కలిగించినందుకు విచారము. తమ ప్రభావానికి వశుడనైనందుననే శిష్టాచారాన్ని వదల లేకుండా వున్నాను.'

ఆమె పెదవులపైన చిరునవ్వు చిందులాడింది.

'నిజం?'

'ముమ్మాటికి.'

'అయితే మనిద్దరికీ నేస్తం కుదురదు. మంచిరోజులు వస్తే మిమ్మల్ని మా సంస్థానంలో ప్రధాని పదవిలో గౌర విస్తాను.'

'ఆ ప్రధాని పదవికంటె మీ స్నేహ సౌభాగ్యాన్నే వేయి రెట్లెక్కువగ కళ్ళ కద్దుకుంటాను.'

'అలాగా!'

'అవును.'

'అలా అయితే మీ మర్యాదా, మన్ననా మూలబెట్టి చనువుతో చక్కగా ప్రవర్తించండి. అప్పుడు చూడండి, నా స్నేహంలోని మాధుర్యం!'

'అంటే?'

'అంటేనా? మీరు నన్ను 'నీవ'ని పిలవండి; నేనూ మిమ్మలాగే పిలుస్తాను. మీరు నన్ను ఏడ్పించండి; నేను మిమ్ము తపింపజేస్తాను. నీవు నా ప్రేమలో ఈదులాడు; నేను నిన్ను వ్రేళ్ళమీద చిందులు తొక్కిస్తాను. నీ రెండుచేతులూ నా మెడకు పెనవేసి 'ప్రేయసీ' అని పిలువు. ఇవాళ నా హృదయం నీతో పెనగులాడాలని ఉవ్విళ్లూరుతోంది. నోటితో పిలిచి చేత్తో నెట్టేస్తా... అరరె! యిదేమిటి?'. అని నాలుక కరచుకున్నది.

యువకునిఒళ్ళు పులకరించింది. కళ్ళలో చీకట్లు కమ్మినె. మనసు వశంతప్పింది.

హాక్ హైనెస్‌ను గట్టిగా రొమ్ము కదుముకున్నాడు. లేగులాబి రేకుల బోలు ఆమె పెదవుల్ని తనివితీర ముద్దెట్టుకున్నాడు.

'డియర్, నీ యాజ్ఞనేగా నేను నిర్వర్తిస్తున్నాను.' అన్నాడు ప్రేమార్ద్ర కంఠంతో.

కిలకిల నవ్వులతో ఈసారి ఆమె స్వయంగానే అతన్ని పెనవైచుకొన్నది. ఇద్దరి హృదయాలు స్పందిస్తున్నవి. అత నొక ముద్దుపెడితే ఆమె రెండు. మధుపానోన్మత్తతచే కామాంధరై ఎక్కడపడితే అక్కడ ముద్దులాడసాగింది.

'చంపావు, చంపావ్ ! మై డియర్ ! నీవు బలేరసికవు' అన్నాడు అత డుద్రిక్తుడై—'నన్నెప్పుడూ మరచిపోవుగదూ నారాణీ !'

హార్ హైనెస్ కొంచెం వెనక్కి తగ్గి తనగ్లాసు నింపుకున్నది. కొంచెం తాగి అరమోడ్పు కన్నులతో అతనివంక చూస్తూ—'నేను మీ మగజాతిని నమ్మను' అంది.

'ఏమిటి !' అన్నాడు విభ్రాంతిచెందిన యువకుడు.

'అది నాస్వానుభవం. నీకు కోపం వచ్చినాసరే, నే నామాటను ఉపసంహరించుకునేది లేదు.'

అతడు నవ్వుతూ అన్నాడు—'అయితే నీకు అందరూ అలాంటివాళ్ళే తగిలారన్నమాట ?'

'నీధోరణినిబట్టి నీకింకా నా అంతు చిక్కలేదన్నమాట !' ఆమె స్వరంలో దర్ప మిమిడివుంది.

'నే నూహించానులే.'

ఆమె 'అయితే సరే లె'మ్మన్నట్టు నవ్వింది. చెయి చాచి 'ఏదీ స్మోక్ !'

అతడు తక్షణం గోల్డు సిగరెట్ కేసు తెరచి ఒకటి అందించాడు.

'ఛా, ఛా, యిదేనా ?'

అతడు తెల్లబోయాడు. తాను కాల్చేది హైక్లాసు సిగరెట్టే అయినా చిన్నపుచ్చుకొని, సందేహంగా అడిగాడు–'మరి ఏరకం?'

'కాల్చి ఇయ్యవోయ్!'

అతను కదుటబడ్డాడు. 'ఎస్, ఎస్' అని వెలిగించి యిచ్చాడు. ఆమెమాట అతనికి నాగస్వరం. చెప్పినట్టు చేయటమే అతని కర్తవ్యం.

'నువ్వు చాలమంచివాడివి.' ఆమె ఒక కాంప్లిమెంటు విసిరింది.

'నీబోటివారు కోటికొకరూ దొరకరు!' అన్నాడు అతడు ముందు కొరుగుతూ. ఆమె కొంచెం లేచి తిన్నగా కూర్చుంది.

'ఆఁ ఆఁ, అందుకే ఎదురుచూస్తున్నా. ఇలాంటి మాటలు నాకు బాగా యిష్టం: కాని నువ్వన్నది హృదయ పూర్వకంగానేనా?'

'ఏమిటి?'

'రసికురాలననేనా?'

'నిస్సందేహంగా. ఇంకా అందులో సందేహం కూడానా?'

ఆమె గ్లాసును మళ్ళీ ఖాళీచేసి 'అందువల్లనే మనిద్దరికీ జత కుదిరిం'దన్నది.

'మంచిది; కాని మనం స్నేహంచేసేముందు పరస్పరం పరిచయంచేసుకోవటం మంచిది కాదూ?'

ఆమె కుడిచేత గ్లాసు పుచ్చుకొని, ఎడమచేయి అతని భుజంమీద వేస్తూ అంది-'అవసర మేముంది? నేనొక దురదృష్ట యువతినని మాత్రం తెలుసుకో. నాకిప్పుడు మిగిలింది ఒక్క అందం మాత్రమే. ఇవి నాకు చెడురోజులు. వింటున్నావా? సంఘంలో యిప్పుడు చెప్పుకోతగ్గ స్థానమేదీ లేదు నాకు. బంధు-మిత్రులంకరికి దూరమయ్యారు. చేతిలో దమ్మిడీ లేదు. ఒంటిమీద నగలన్నీ ఒకటొకటిగ చెల్లిపోయినై. ప్రస్తుతం నాకూ, నా కార్యదర్శికీ రెండు టిక్కెట్లు కొంటూ నిక్కాడా పైకంలేకపోయిదంటే నీ కాశ్చర్యం కలగొచ్చు.'

ఆమె కన్నులు చెమ్మగిల్లినై. గ్లాసు కిందపెట్టి మళ్ళీ ప్రారంభించింది:

'నా యీ మాటలు నీకు అసంతృప్తిని కల్గించవచ్చు. అంతేకాదు. బహుశ నువ్వు నన్ను అసహ్యించుకున్నా అందులో నీ తప్పేమీ వుండదు; కాని యివన్నీ దాచిపెట్టి ఉదారహృదయుడవైన నిన్నంధకారంలోమాత్రం వుంచలేను. తెలిసిందా? నీ స్నేహం సంపద్భాగ్యాలకు సంబంధించిందిమాత్రమే అయితే; మన యీ మైత్రి నింతటితోనే సమాప్తంచేయటం మేలు. అలా జరిగినా నే నేమీ ఆశ్చర్యపడను. ఎందు కాశ్చర్యం! మొగజాతి యందు నా కేర్పడ్డ భావంలో యిది నామమాత్రమే.'

అత డింతవరకు గుడ్లు వొప్పజెప్పి వింటున్నాడేగాని మారు మాటాడలేదు. కేవలం నిర్వికారభావంతో వింటూ హార్ హైనెస్ మోము నవలోకిస్తున్నాడు.

'ఏం, నా మాటవల్ల విచారమూ, సానుభూతీ కలుగుతున్నాయా?' ఆమె ఒక గుటక వేసి మళ్ళీ అన్నది—'అది అసంభవమే. ఎందువల్లనంటావా? ప్రేమానర్హులు-విశ్వాసఘాతకులు-తుపాకిగుండుకు ఎరచేయబడతగ్గవారిలో నువ్వు చేరవు. ఇందులో విడ్డూరపడవలసిన దేమీలేదు. ప్రతి విషయంలోను ఎక్సెప్షన్ వుంటుంది. మరొక వ్యక్తి కూడా నాకు నచ్చాడు. అతడే స్వచ్ఛమైన పురుషుడంటాను. అతనెవరోకాదు; నా కార్యదర్శే. నేను వేలకొద్దీ దాస-దాసీ జనంమీద హుకుం చెలాయించాను; కాని నౌకరు నౌకరే. నా కార్యదర్శివంటి భృత్యుడు - తన ఉదరపోషణకంటే యజమాని సేవయందే ఎక్కువ శ్రద్ధకలిగి వుండేవాడు - భృత్యుడుకాదు, రత్నం! అట్టివాడుకనుకనే నేనతన్ని అమితంగా ప్రేమిస్తున్నాను.'

అత డిప్పటికిని నోరు తెరువలేదు. ఒక వేడినిట్టూర్పు మాత్రం విడిచాడు.

'నా యీ సొదతో నీ మనసు పాడవుతుందనీ, నీ ఆనందము పటాపంచలగుననీ ఎరుగుదును; కాని చెప్పక తప్పదు. నన్నెందరో మోసగించారు; నా హృదయాన్ని తుత్తునియలు గావించారు. నిన్ను కలతపరచినందుకు క్షమించు.'

ఆమె ఆ మిగిలిన బ్రాందికూడా గొంతులోపోసుకుంది. హద్దుమీరిన సురాపానంచే కామాగ్ని కింధనమైయున్న హర్ హైనెస్, నవనాగరికుడైన సిక్కుయువకుడితో తర్వాత ఎట్లా గడిపినదీ వర్ణించటానికి మా లేఖిని వెనుకంజవేసింది. అందుచేత పాఠకులే ఊహించుకొందురుగాక!

# 6

చక్కనిచుక్క లనదగు విలాసవతులు అయిదారు గురు రాజాగారి చుట్టూ కూర్చొనివున్నారు. నిగనిగలాడే గాజుటేబిల్సు ఒకదాని కొకటి ఆనివున్నై. రంగు రంగుల తివాసిమీద రోజువుడ్ కుర్చీలు, సోఫాలు, వాటిలో మొఖ మల్ దిండ్లూ విద్యుత్ కాంతిలో వింతరంగు లీనుతున్నవి. రాజాగారి ఆంతరంగిక బృందంయావత్తూ సుఖాసీనమైవుంది. అందరికీ యెదురుగా వున్నతాసనంమీద శ్రీవారు స్వయంగా విరాజిల్లుతున్నారు.

ఈయనగారే హిజ్ హైనెస్! నేడు వారి విలాసలీలలకు మేరలేదు. వైస్రా యంతటివాడు సందర్శన మివ్వటమేకాక స్వయంగా వారిపైన అభిమానాదరములు ప్రకటించాడు... హిజ్ హైనెస్, వారి పర్సనల్ స్టాఫూ మోతాదు పెంచా రీ వేళ. ఒక్కొక్క గంట గడుస్తుంటే ఒక్కొక్క పెగ్గు వారి ఉదరాల్లో పడుతోంది.

'పాట!' అన్నారు, శ్రీవారు ఆకస్మికంగా తన కెదురుగావున్న చిన్నదాన్ని సంబోధించి 'పాడుతావా?'

'చిత్త'మన్న దా యువతి వినయవిధేయతలతో.

'ఏం పాట పాడుతావు? ఏ రాగంలో?'

'తమ ఆజ్ఞ హుజూర్!'

'ఏదో ఒకటి పాడు.'

వెంటనే యిద్దరు నౌకర్లు ముందుకొచ్చారు. మధ్యలో వున్న బల్ల వగైరాలు తొలగించి పాటకురాలు కూర్చుం

టానికి ఖాళీచేశారు. హార్మోనీ, తబలా, వీణ, ఫిడేలు వగైరా వాయిద్యాలతో హంగుదార్లొచ్చి తిష్ట వేశారు.

'పాడు, పాడు. 'ప్రియా ఓడితి నోయీ నీకూ' పాడు.'

పాట ప్రారంభమైంది. రెండోవరుస గ్లాసులునింపటం కూడా అప్పుడే మొదలు.

ఒక పెద్దమనిషి తనముందున్న వారిని చాటుచేసుకొని కొద్దికొద్దిగా తాగుతున్నాడు. ఆ గ్లాసుతోనే మరొక రౌండు సరిపెట్టాలని ఆ పిరికివాని ప్రయత్నం; కాని దొంగతనం దాగుతుందీ! అది రాజాగారు కనిపెట్టారు. వారి బుర్రకు స్విచ్ వేసినట్టయింది. ఒక ఏ. డి. సి. కి కనుసైగ చేశారు.

ఏ. డి. సి. గబ గబ తన పెగ్గురు పీల్చేసి పెంపుడు కుక్క తో కాడించునట్లు వంగి వంగి దణ్ణాలుపెట్టి పైనచెప్పిన పెద్దమనిషి వెనక్కిపోయి నిలబడ్డాడు.

'ఎస్!'

ఇది రాజుగారి ఆమోదన.

తక్షణమే ఏ డి. సి. ఆ పెద్దమనిషి చెంపమీాద ఫిడేలున ఒకదెబ్బ కొట్టాడు. అది మిగతా వాళ్ళందరికీ మనోవినోదమయింది హీ హీలు, హే హేలు! ఇకఇకలు, పక పకలు! పూర్వపు మొగలాయి దర్బారులోనిభట్టులాగా-గ్రామఫోను రికార్డులాగా 'సభా ధిక్కరణచేసేవాని కిదేశిక్ష' అన్నపలుకులు ఏ. డి. సి. నోటినుండి వెలువడినై.

పాట ముగిసింది.హంగుదార్లు యథాప్రకారం కూర్చొనేవున్నారు.

'నీకు పాటరాదు, పో' అన్నారు రాజాగారు.

ఆ యువతి చిన్నపోయింది. అవమానభారంతో క్రుంగిపోయింది. అయినా ఆరితేరిన ఆ లజ్జావిహీన తన మనోభావాన్ని వెలిబుచ్చక వచ్చినప్పటిమాదిరిగానే వెనక్కి తగ్గింది.

'నువ్వో పాడగలవూ?'

ఇది ఆ వరుసలో రెండవదిగాకూచున్న పడుచు నుద్దేశించి అన్నమాట. ఆమె కళ్ళెంవేసిన గుఱ్ఱం మాదిరి తల ఊపి అంగీకారాన్ని తెలిపింది.

'ఏమేమి పాడగలవు?'

'ప్రభువువారి చిత్తం.'

'అయితే పద్యాం ఎత్తుకో!'

అని చెప్పి సభాసదుల అంగీకారంకోసం వారు అటూ ఇటూ చూశారు.

'పద్యం. పద్యం' అన్న ధ్వని అన్నివైపుల నుంచీ ఒక్కసారిగా వినపడింది.

షీరీన్—ఫరహాద్ లోని ఒక పద్యం ఎత్తుకుంది; కాని హిజ్ హైనెస్‌కు నచ్చలేదు. పాడుతున్న పడతి శ్రీవారి చేసన్నతో మధ్యలోనే మ్రింగివేయవలసివచ్చింది.

'కీర్తన!'

మళ్ళీ దొరగారి ఆజ్ఞ. మరి దానికి తిరుగులేదు.

'చిత్తం'తో కీర్తన ప్రారంభమైంది.

ఈ పర్యాయం హిజ్ హైనెస్ తన్మయులయ్యారు. తల ఊయలలా ఊగసాగింది. మిగతావారువూరుకుంటే ఎట్లా?

అక్కడున్న చిన్న—పెద్ద తలకాయలన్నీ వూగులాడ సాగాయి. 'వహ్వా, వహ్వా'లు చెలరేగినై. పాప మా పడుచు మాత్రం చాలా అవస్థపడింది.

'ఏయ్! నీ సంగతేమిటి?'

కుర్చీకోడుమీద చెయ్యేసి రెప్ప లార్చకుండా హిజ్ హైనెస్ పైనే వాలూచపునిల్పి, వారిదృష్టి నాకర్షించటానికి సతమత మవుతున్న మూడో వారవిలాసిని దీసారి వంతు.

ఆ వన్నెలాడి అవసరమైన అణకువ, చురుకుతనం చూపుతూ ముందుకొచ్చి నిలబడింది. ఆమె నడచేటప్పుడు ఒయ్యారం వొలికిస్తూ చేతిగాజులు గలగలమనిపించింది.

'డాన్స!'

మరుక్షణంలో సభాసదుల 'డాన్సు' అన్న నినాదంతో హాలు ప్రతిధ్వనించింది.

కాళ్ళగజ్జియలు ఘల్లుఘల్లు మన నృత్యం చేస్తోంది వారకాంత. అది తరంగనృత్యం. తాగిన మధువు మెదడు కెక్కి అందరికళ్లు అగ్నిగోళాల్లాగ మెరుస్తున్నవి. నాట్యం బాగా రక్తికట్టింది. ఒకరినిమించి మరొకరు పరవశు లవుతున్నారు. కాస్సేపటికి ఆమెకూడా సెలవిచ్చారు.

ఇంకా ముగ్గురు మిగిలిపోయారు.

# 7

'త్రే, దాన్నిటు తే'

హిజ్ హైనెస్ నోటినుంచి ఈ మాట వెలువడిందో లేదో హార్మోనియము శ్రీవారి ముందున్న టేబిలుమీదకు చేర్చబడింది. శ్రీవారి కోమలాంగుళులు రీడ్సుతో ఆడుకో సాగాయి.

'ఎవరు పాడుతారు ?'

వారిచూపు లీసారి పురుషబృందంవైపు మళ్ళాయి. అటుతిరిగి యిటుతిరిగి లావుగా - బొద్దుగావున్న ఒక యువకునిమీద నిలిచింది శ్రీవారి దృష్టి.

'రా, యిటురా.'

లోలోపల విసుక్కుంటున్నా పయికి నవ్వుతూ, వచ్చి నిలబడ్డాడు.

'పాడు'

అతను బిక్కమొగం వేశాడు.

హిజ్ హైనెస్ నిషా హుషారులో నవ్వుతూ 'సిగ్గుపడుతున్నావా? సిగ్గు!' అని అడిగారు.

సేవకులు ఒకరొకరే బయటకు దారిపట్టారు. వాళ్ళకు శ్రీవారి మాటల్లోని అంతరార్థం కొట్టినపిండే!

'ఇక పాడు, ఇంకెందుకు సిగ్గు?......అరె ! ఇంకా వెకపేన్నా?'

'కాదు, సర్కార్!'

'మరి?'

'ఇంతమంది పెద్దలయెదుట ...'

'అహ్హాహ్హా! వీళ్లు పెద్దలా! అరె, వీళ్లు విద్వాంసులా? అందరికంటె నువ్వే మంచి పాటగాడివోయ్! పాడు, పాడు.'

ఇక ఎదురు చెప్పటానికి దమ్ములేకపోయింది వానికి. కిక్కురుమనకుండ ఆలాపన మొదలెట్టాడు. బాగో ఓగో వచ్చినట్టు పాడితీరాడు. హిజ్‌హైనెస్‌కు అదే బాగుంది. వారే స్వయంగా హార్మోనియం వాయిస్తూ – తలాడిస్తూ – భేష్, భేషంటూ వుంటే ఇక మజాగా వుండనిదెవరికి! చంద్రోదయ సమయంలో సముద్ర తరంగాలమల్లేనే యీ వినోదాంబుధిలో మానవ శరీరతరంగాలు కేరింతలు కొట్ట సాగాయి. పెగ్గుమీద పెగ్గు, బుడ్డి తర్వాత బుడ్డి ఎగిరిపోతు న్నాయి. నిలువెల్ల మైకంకమ్మి అందరూ తూలుతున్నారు. అంతలో టక్కున హార్మోనియం ఆగిపోయింది.

'ఏయ్, నీకు నాట్యం చేతనవునా?'

అంగీకారసూచకంగా తలాడించింది ఒక అంగన.

'నీకో?'

'జీ సర్కార్!'

'నువ్వో?'

'నేనూ చేయగలను ప్రభూ!'

'అందరికీ వచ్చున్నమాట. అయితే ముగ్గురూకలిసి కానివ్వండి... ...ఊఁ, జోరుగా! మహా మజాగా వుండాలి; తెలిసిందా?'

సభాసదులంతా క్రమంగా కుర్చీలను వెనక్కి జరుపు కున్నారు. హంగుదారులు పక్కకు తప్పుకున్నారు. మరికొంత ఫర్నీచరు దూరంగా చేర్చబడ్డది.

'పంచతాళ నృత్యం!'

శ్రీవారనటం, బృందమంతా అనుసరించటం జరిగింది.

సభికులలో ఏ ఒక్కరి మెదడూ పనిచేయటంలేదో, లేక నోరు తెరచే తాహతే లేదో—పంచతాళనృత్య మనేది ఒకటి అస లున్నదా లేదా అని ఆలోచించినవాడుగాని విమ ర్శించినవాడుగాని లేడు. నంది అంటే నందే, పంది అంటే పందే !

ఆ కామినులు గంతులేస్తున్నారు. చిందులు తొక్కు తున్నారు. చివాలున వంగి లేస్తున్నారు. గిరగిరా తిరుగుతు న్నారు. హిజ్ హైనెస్ హృదయ మానందంతో పరవళ్ళు తొక్కుతోంది. తతిమ్మావారి సంగతి వేరే చెప్పాలా !

'భేష్, భేష్ ! శెభాష్, శెభాష్ !'

మలయానిలమందమారుతానికి మనసు వికసించు నట్లు రాజుగారి ప్రశంసాజనితోత్సాహంతో వుప్పొంగి పోయారు. వొంగి నమస్కారాలు పెట్టారు.

'ఆపవద్దు, ఆపవద్దు.' అప్పుడే నింపబడ్డ గ్లాసును చేత బట్టి గటగట తాగి తడబడుతూ హిజ్ హైనెస్ అన్నారు— 'మీరు... అల... సి... పోయ్యారా ?'

అలసివుంటే మాత్రం వా ళ్ళందు కంగీకరిస్తారా ? అంతే! ఒప్పుకుంటే ప్రాణాలు దక్కటమే! వాళ్ళ నాయకుడు ముసలి పీనుగ – భుజం ఎగరేసి సైగ చేస్తూనే వున్నాడు.

చెప్పినట్టు చెయ్యకపోతే చితకపొడిచి పచ్చిమాంసం తినె య్యడూ! ఏంచేస్తారు పాపం? వాళ్ళవృత్తి అలాంటిది!

వృద్ధజంబుకం చేతిలోని వీణనుంచి సన్నని స్వరం బయల్దేరింది. తబలామీద చెయ్యిపడింది. ఇంకేముంది! ఆ కాంతలకాళ్ళగజ్జెలు ఘల్లుమన్నవి.

'వహ్వా!' అని హిజ్ హైనెస్. మెచ్చుకోలు. వెంటనే అందరినుంచీ 'వహ్వా'లు చెలరేగినై.

'పాటవద్దు, ఒట్టి డాన్సు!'

కామినీకంకణనిక్వాణాలూ, అందెలమ్రోతలే శ్రీవారికి వినడం ఇష్టం.

ఆజ్ఞ అమలుజరిగింది. ఇలా రెండుగంటలు ఆ దుర దృష్టవతులు ఏకధాటిని మొఖమల్ తివాసీమీద సినిమా చిత్రాల్లాగ నాట్యంచేశారు. ఒళ్ళు హూనం అయినా పొగ డ్తలు దండిగానే దక్కాయి.

బంట్రోతులు, నౌకర్లు అంతకు పూర్వమే వెళ్ళిపోవ టంవల్ల గ్లాసులు నింపేపని యిద్దరు ఏ. డి. సి. ల పైన పడింది. ఏ ఒక్కరిగ్లాసూ ఖాళీగా వుండకూడదు. అదే ఆ జల్సారివాజు.

హోటలు పైభాగమంతా మహారాజాగారికోసం ప్రత్యేకించబడింది. ఇది మధ్యభాగంలోని పెద్ద హాలు. ద్వా రాలు, కిటికీలూ అన్నీ మూయబడినై. లోపలికి జొరబడా లంటే హనుమన్న అబ్బకైనా శ్రీవారి హుకుం కావలసిందే.

ఆ సభాసదులు - రాజావారి ఆంతరంగిక బృందం- జనాన్లు. సేవకులు, హిజ్ హైనెస్ వెంట వచ్చినవారే. ఈ

విలాస - విభ్రమాలు, విచిత్ర - వినోదాలు వారి నిత్యకార్య క్రమంలోనివే. కాని ఆనాటి వారి ఖులాసాకు పట్టపగ్గాలు లేకుండా వున్నై. శ్రీవారి చిరవాంఛిత యీాప్సితము నెర వేరిందినేడు. వారిజీవితంలో వైస్రాయి సందర్శనానికి ప్రత్యే కత ఏమీాలేదు; కాని నేటి యింటర్వ్యూలో విశేషం లేక పోలేదు. వైస్రాయి స్వయంగా ఎదురొచ్చి స్వాగతమిచ్చాడు; ముందుగా చెయిచాచి కరస్పర్శచేశాడు. వీరిని కూర్చుండ బెట్టిగాని తా నాసీనుడు కాలేదు. ఇవన్నీ వీరికి వైస్రాయి అనుకూలతనే ప్రదర్శిస్తున్నవి. ఎప్పుడూ గాంభీర్యాన్ని వీడని వైస్రాయి నేడు మాట మాటకు చిరునవ్వు తొలికిం చాడు. అభిమానం చూపాడు. అన్నిటినీ మించింది, సహా యంచేస్తానని స్పష్టమైన వాగ్దాన మివ్వటం. సంస్థానమంతటా అరాచకత వ్యాపించివున్న పరిస్థితిలో గవర్నరు జనరల్ వాగ్దానం ఎంత విలువైనది!

వైస్రాయి ఎంత సహృదయుడు! మధురభాషి!! ప్రతిమాట తూచి ఎంత చక్కగా మాట్లాడుతాడు! ఎంత విశాలహృదయుడు కాకపోతే సంస్థానాధిపతుల పట్ల ఇంత అభిమానం ప్రకటిస్తాడు! ఈనాటిసందర్శనం నిజంగా శ్రీవారికి స్వర్గతుల్యం!

ఇక అసలు కథకు వద్దాం.

'ఇక కూర్చోండి.'

వాళ్ళు నమస్కరించి 'బ్రతుకు జీవుడా' అని చతికిల బడ్డారు.

'వెల్తురు తీక్ష్ణంగా వుంది.'

కొన్ని లైట్లు తగ్గించబడినై. కాంతి మందగించింది.

అందరిలో చిన్నదీ - దివ్యమోహన విగ్రహం అయిన కోమలాంగి రూపురేఖా విలాసాలకు ముగ్ధులై హిజ్ హైనెస్ అడిగారు—'ఏమే! హంగు లేకుండా గంతెయ్య లేవూ?' అని.

ఆ చిన్నది అతిమృదువుగ తనచాతుర్యాన్ని చిరునవ్వులో చిందులాడిస్తూ, చూపుల్లో నాట్యమాడిస్తూ తలాడించింది.

అప్పు డొక సైగ.

యువకుడైన ఒక ఏ. డి. సి. ముందుకొచ్చి హంగు దార్ల కేమో చెప్పాడు. వెంటనే వాళ్ళందరూ సలాములు పెడుతూ సామానుతోసహా నిష్క్రమించారు. తలుపు తిరిగి బంధించబడింది.

'వెళ్ళేవారు వెళ్ళిపోవచ్చును.' అర్ధనిమీలిత నేత్రాలతో, నిలకడలేని మనస్సుతో, పెదవులదురుతూండగా హిజ్ హైనెస్ అన్నారు.

ఇది రెండోసూచనకు చిహ్నం. రాబోయే రంగంలో వుండటాని కర్హతలేని సభ్యులు తక్షణం తొలగిపోవాలి. ఆ రకంవారంతా మెల్లగా జారుకున్నారు.

'అబ్బ! ఉక్కగా వుంది.' భుజంమీదవున్న కాశ్మీరు శాలువాను జారవదలి సమ్మోహనాస్త్రం వేస్తున్న చిన్న దానితో అన్నారు—'నీకు చెమటపట్టటంలేదా?' ఆమె నవ్వుతూ లేదని వత్తి చెప్పింది. ఈ జవాబుకు అంతా స్థంభించిపోయారు.

'చంపావ్! అయితే డాన్సు చెయ్యి.'

ఏ. డి. సి. ఒక డా సుందరాంగిని సమీపించి ఆమె కోటును తొలగించబోయినాడు.

ఆమె చిరునవ్వుతో అడ్డుపెట్టటం గమనించి హిజ్ హైనెస్ అందుకున్నారు – 'ఓహో! దానికి సిగ్గుగావుంది. అయితే అంతా కోట్లు తీసివెయ్యండి.'

మరునిమిషంలో స్త్రీ – పురుషులు యావన్మందీ కోట్లు తీసివేశారు.

'కాంతి యింకా ఎక్కువగానే వుంది.'

మరికొన్ని దీపాలు ఆర్పివేయబడినై.

'ఇవాళ యింత హాట్‌గా వుందేం?' అని, చిన్న దానితో 'నీకు ఉక్కగా లేదూ?' అన్నారు రాజాగారు.

'లేదు హుజూర్.' మళ్ళీ వెంకె సమాధానమే యిచ్చింది.

'దగ్గరకురా.'

ఆమె భీతహరిణివలె తారుతూ చిన్న చిన్న అడుగు లేసుకుంటూ సమీపించింది. శ్రీవా రామె మనికట్టు లంకించు కొని గట్టిగా ముందుకు లాగారు.

'ఊఁ' అని ముల్లు గుచ్చుకున్నప్పటిలాగా మూలిగింది ఆ టక్కులాడి.

'మైడియర్, యిక్కడ కూర్చో.'

వా రామెను సోఫాలో ప్రక్కన కూర్చుండబెట్టుకొని తెరపిలేని ముద్దులవర్షం కురిపించసాగారు. రొమ్ము కదుము

కున్నారు. ముద్దుల వర్షం కురిపిస్తూ శరీరాన్ని నలిపేశారు.

'ఇప్పటికైనా వొళ్ళు వేడెక్కిందా?'

ఆ కులట అప్పుడుకూడా విషపూరితము, లజ్జారహిత మైన చిరునవ్వుతో 'లే'దనే జవాబిచ్చింది. శ్రీవారు మద్య మున్న గ్లాసు దానికిచ్చి త్రాగమన్నారు.

'ఉఁహూఁ'

'తాగు!'

ఆమె తాగింది. మిగతా భోగంపడుచులకు కూడా తాగమని ఆజ్ఞ అయింది. వరుసగా ఒకటి – రెండు–మూడు గ్లాసులు మాయమయ్యాయి.

'లైట్లన్నీ ఆర్పివెయ్యండి.' అని, వారాంగనల నుద్దే శించి 'అందరు దిసమొలల్తో డాన్సు చెయ్యండి.'

ఈ మాటల్లో హిజ్ హైనెస్ అధికార దర్పం ప్రస్ఫుటమవుతోంది. యౌవనమదంతో కండకావర మెక్కి ఉన్న చిన్నది వారి ఆజ్ఞను శిరసావహించటానికి, సోఫాలో నుంచి లేచివెళ్ళి తతిమ్మావారితో కలిసింది. హిజ్ హైనెస్ ప్రక్కనే వేచియున్న ఏ. డి. సి. చెవిలో 'మంచి అదను చూచి లైట్లన్నీ ఒక్కసారిగా వెలిగించు' మని వూదారు.

# 8

మధ్యరకం హోటల్లో ఒక గది. పరదాతో దాన్నే రెండుభాగాలుగా చేశారు. వెనుక భాగంలో పడకలు, ముందు కుర్చీలు, బల్లలు వగైరా. 'కాల మొకరీతి గడచునేయెట్టివారి' కన్నట్టు అందులోనే గడుపుతున్నారు హర్ హైనెస్‌వారు.

చేత చిల్లికానీ లేదు. వచ్చేదారీ కనిపించటం లేదు. హర్ హైనెస్ సిల్కుచీరలు మలినమై కళ తప్పుతున్నవి. పడక మీది దుప్పట్లు మార్పు కోరుతున్నవి. స్లిప్పర్సుకు పాలిష్ పూట మెలావున్నా మరమ్మతు జరూరు.

మరి మధువో!

ఆ హోటల్లో రోజంతా సప్లయిచేసి వుదయమే బిల్లు చెల్లించమనటం మామూలు. కాని వీరి డాబు - దర్పం చూచి మూడురోజులవరకు మెమో పంపలేదు. ఈలోగా యెంత బిగబట్టి వాడినా నాలుగు వైట్‌హార్సు బుడ్లకు తక్కువ కాలేదు.

సాకీ రోజూ వెళుతున్నాడు; చేతులాడించు కుంటూ తిరిగి వస్తున్నాడు.

ఫలితం శూన్యం. భావి అగమ్యం.

వా ళ్ళే ఆశతోటి సిమ్లా చేరుకున్నారో అదేమీ ఫలించలేదు. పొలిటికల్ డిపార్టుమెంటులో ప్రవేశంకోసం యమయాతనపడ్డాడు సాకీ ఎన్ని తిప్పలుపడినా ప్రయోజన మేమీ లేకపోయింది. అందులో ప్రవేశం దొరకనిదే వైస్రా యిని బుట్టలోపెట్టటం అసంభవం. వాస్తవానికి స్వదేశ

సంస్థానాలకు తల్లీ-తండ్రీ-దైవమూ అన్నీ పొలిటికల్ డిపార్టు మెంటే. దాని దెబ్బకు తిరుగులేదు. దానిశిక్షకు అప్పీల్లేదు.

హీజ్ హైనెస్ ప్రస్తుతం సిమ్లాలోనే వున్నారనీ, వారికి ఫలానానాడు వైస్రాయి దర్శనమిచ్చారనీ తెలిసింది.

'ఇవాళ అయినా పనిజరిగిందా ?' సాకీ గదిలోకి రాగానే అడిగింది హర్ హైనెస్.

'లేదు హుజూర్!'

ఆమె ఒక నిట్టూర్పు విడిచింది. ఆశ సన్నగిలి మరి మాట పెగల్లేదు.

'నాకూ విచారంగానే వుంది' అన్నాడు సాకీ.

'తమ కీ సమయంలో ఎందుకూ కొరగాకపోతున్నానని సిగ్గు పడుతున్నాను.'

'ఫర్వాలేదు.' అంది ఆమె సహజగాంభీర్యం పోకుండా 'మాకు భగవంతుని న్యాయదృష్టిలో విశ్వాసంవుంది. ఈ కష్టాలకే లెక్క చేస్తామా ?'

సాకీ రెప్పవాల్చకుండా ఆమెవంక చూచాడు. ఆమె కూడా చూపులో చూపు కలిపింది. ఇద్దరూ ఒకరి హృదయా వేదనను ఒకరు గ్రహించుకున్నారు.

'తమ గత జీవితం తలపుకొచ్చి నా హృదయం దహించిపోతోంది హుజూర్!'

'కాని నాకా జీవితంమీద అభిమానంకాని, మోజు కాని లేదు సాకీ. ఆ బంధిఖానాలో నా ప్రాణం బేజారై పోయింది. ఆ ప్రదర్శనశాలనుండి బయటపడి పక్షినై ఎగురుతూ స్వేచ్ఛ ననుభవించాలని ఎంతగా తహ తహ

లాడాను! అక్కడ నాకు ధనం-నగలు-గౌరవం-అన్నీవున్నై; కాని సుఖం నామమాత్రానికైనా లేదు. అది ఘోషా - బానిసత్వాలతో ఎంత నికృష్ట జీవితం! నీ కా బాధ అర్థం కాదు సాకీ!'

'లేదు యువర్ హైనెస్! తమకీ దుస్థితి తగదనిమాత్రం నాకు తెలుసు.'

'అవును, నిజమే; కాని అది నాకూ నీకూ కూడా తప్పనిసరిఅయింది. చేయగలిగినంతవరకు చేస్తూనేవున్నాంగా. ఏ దారీ కనపడనప్పుడు నుయ్యో గొయ్యో వుండనే వుంది.'

సాకీ ఒళ్ళు ఝల్లుమన్నది. కళ్ళు చెమ్మగిల్లినై.

'వారు మొన్న వైస్రాయిని దర్శించారు.'

'ఎవరు?'

'హిజ్ హైనెస్.'

'నా ముందు వారిపేరెత్తకు' అంది ఆమె విరక్తితో.

'చిత్తం.'

'నా మనస్సులో ఏమున్నదో తెలుసా?'

'తెలియదు హుజూర్!'

'ఊహించలేవూ?'

'ఈ దుస్థితిలోనుండి బయపడేదెట్లా అని ఆలోచిం చుతూవుండివుంటారు.'

ఆమె నవ్వి 'కాదు, నీ వూహా తప్పు.' అంది.

'అయితే తమరే సెలవివ్వండి.'

'ఈక్షణంలో రెండుషాంపైన్‌బుడ్లు లభించితే ఎంతో బాగుండునే అని. ఇక హోటలువాళ్ళు సప్లయిచేయరుగా'

# 9

'నేను రావచ్చునా?'

ఇద్దరూ ఉలిక్కిపడి ద్వారంవేపు చూశారు. హర్ హైనెస్‌తో కులాసాగా రైలులో ప్రయాణంచేసిన సిక్కు యువకుడు ద్వారంవద్ద నిలబడివున్నాడు.

విలువైన దుస్తులువేసుకుని, సన్నని బెత్తం చేతపట్టి లావాంటి సిగార్ కాలుస్తూ లోపలికి అడుగుపెట్టాడు.

'నా అశిష్టానికి మన్నించాలి.' అంటూ గడపదాటుతున్న యువకుడు హర్ హైనెస్ చిరున వ్యాహ్వానం కాగా గదిలోకి వచ్చాడు.

'సూచనఅయినా యివ్వకుండా వచ్చేశాను. మీ తుదిపలుకుకూడా ఆలకించాను. ఈ నా అసభ్యప్రవర్తనకు నేనే సిగ్గుపడుతున్నాను; కాని నా అపరాధం లేదు యువర్ హైనెస్!' అని నవ్వాడు.

ఆమెకూడా నవ్వింది; కాని సాకీ మానందాల్చి రెప్పలార్చకుండా నవాగంతుకుని వంక తేరిచూస్తున్నాడు. హర్ హైనెస్ సాకీ వంక అదోవిధంగా చూసింది. ఆ చూపులోని భావం గ్రహించి కాజోలు సాకీ ముఖభంగిమ మార్చాడు. లేని నవ్వు తెచ్చిపెట్టుకొని అక్కడినుంచి మెల్లగా వెళ్ళిపోయ్యాడు.

'రెండు బుడ్లేనా మీరు కోరుతున్నది?... మీ రింత కష్టదశలో వున్నారని నాకు తెలియదు. లేకపోతే యింతకు ముందే కలుసుకొని వుండేవాణ్ని. మీరు యథార్థాన్ని నా

వద్దకూడా దాచివుంచారే! ఇపుడిప్పుడే ఒకచోట మీకు జరిగిన అన్యాయం, కలిగిన దుస్థితీ తెలిశాయి. ఈవిష యం తెలియగానే బయల్దేరి తిన్నగా మీవద్దకు ఎగిరి వచ్చాను. కాని... బోయ్...!'

కాలితో తలుపురెక్కను తోసుకొని మిలమిల్లాడే ట్రేతో బోయ్ లోపలికొచ్చాడు. అందులో రెండు షాంపైన్ బాటిల్సు, గ్లాసులు, సోడాబుడ్లు, మంచుగడ్డా వున్నై.

ఏమాత్రం శబ్దం చెయ్యకుండా ట్రేను టేబిలుమీద పెట్టి మర్యాదపూర్వకంగా తలవొంచి వెళ్ళాడు.

'ఎందు కిన్ని ?'

'మనకోసమే, సందేహ మెందుకు ?'

ఈసారి ఒక పళ్ళెంలో వేయించిన వేడి వేడి చాప్సూ కైమా, రకరకాల కేకులూ తెచ్చాడు బోయ్. అన్నీ బల్ల మీద సర్ది రెండు డ్రింకులు తయారుచేసి తప్పుకున్నాడు.

'ఫర్ యువర్ హెల్త్ అండ్ హాపినెస్ యువర్ హైనెస్!' అని విప్పారిన మొహంతో ఒకగ్లాసు నామె కందించాడు.

'మెనీ మెనీ థాంక్స్!' అన్నది గ్లాసు నందిపుచ్చు కుని కృతజ్ఞత తెలుపుతూ రాణీ సాహెబ్. తొలిగ్లాసుతోనే ముఖం రంగు మారింది. ఆమె వ్యాకులపాటు క్రమంగా అదృశ్యంకాజొచ్చింది. అతడు మొదటినుంచీ మంచి మూడ్ లోనే వున్నాడు.

ప్రతి పావుగంటకు ఒకగ్లాసు ఖాళీ కాసాగింది. ఇద్దరూ సిగరెట్లు ముట్టించారు. గుప్ గుప్ న పొగ వదుల్తున్నారు.

ఇద్దరినీ ఏకంచెయ్యటానికో అన్నట్టు పొగ వారిచుట్టూ కమ్ముతోంది. చూపులు వాడి తూపులై హృదయాలను దూసుకుపోతున్నాయి. మాటలు తేనేపట్టులై ఊటలూరిస్తున్నవి.

హర్ హైనెస్ మేలిముసుగు నెత్తిపైనుంచి భుజంమీదికి తర్వాత ఒడిలోకి జారిపడింది. ఉల్లిపొరలాంటి సన్నని జాకెట్టును చీల్చుకొని ఆమె వక్షాలు బయటికి నిక్కిచూస్తున్నట్టుండి అతనికి వెర్రెత్తిస్తున్నవి. ఆమె కళ్ళలో కామోద్రేకము తొణికిసలాడుతోంది.

'ఓ, మైడియర్! నీ దెంత ఉదారహృదయం!' అన్నది అకస్మాత్తుగ హర్ హైనెస్–'నీ రాక మునిగిపొయ్యేవానికి తెప్పకర్ర చందంగా ఉపకరించింది సుమీ!'

'మీ దయకు కృతజ్ఞుణ్ణి.' అన్నాడు అతడు నాటకంలోని పాత్రవలె – 'మీ రానాటి రాత్రి మన ప్రేమానుభవ సమయంలోకూడా యీ రహస్యం దాచివుంచినందుకు చింతిల్లుతున్నాను.'

సిగరెట్ ధూమ నిర్మిత మేఘమాలిక చాటునుంచి హర్ హైనెస్ ప్రేమకటాక్షవీక్షణాలు విసురుతూ 'పరిచితులందరూ క్రూరమృగాలై వెంటబడి నన్ను తరమటంవల్ల భయవిహ్వాలనై, యీ కష్టకాలాన్ని అజ్ఞాతవాసంలో వెళ్ళబుచ్చ దలచాను' అన్నది.

'కాని పున్నమవెన్నెలవంటి మీ నవయౌవనాన్ని కష్టాలనే కారుమేఘాలచే కప్పివుంచటం–ముఖ్యంగా వాటిని చెదరగొట్టటానికైనా కృషిచేయకపోవటం నాదృష్టిలో ఆత్మ

హత్య కంటె తక్కువేమీ కాదు. మీ హక్కును మళ్ళీ పొందటానికి శాయశక్తులా కృషిచెయ్యాలి. అచిరకాలం లోనే మీ కోర్కె ఈడేరగలదని నా విశ్వాసం.'

ఆమె ఒక గుటకవేసి గ్లాసు కింద పెట్టకుండానే అడిగింది—'మీకు నా వివరాలన్నీ తెలిశాయన్నమాట?'

'ఎస్, ప్రతి చిన్నవిషయంకూడా నాకు అవగతమై పోయింది.'

హర్ హైనెస్ ఒక లిప్తకాలం మౌనం దాల్చింది. తర్వాత వేదనాభరిత స్వరంతో చెప్ప నారంభించింది—'ఈ నిర్భాగ్యురాలి విషయంలో శ్రద్ధ చూపుతున్నందుకు మీకు ఎంతైనా కృతజ్ఞను. నా కష్టదశలోని గత రెండు సంవత్సరాల్లోను నా సంబంధీకు లంతా మోసగాళ్ళు, దోపిడిగాండ్రుగా తేలారు. ఒక్క నా కార్యదర్శి మాత్రమే ప్రాణమిత్రుడై మిలిగాడు. ఇన్నాళ్లూ అతడే అతి విశ్వాసంతో నన్నంటిపెట్టుకొని వున్నాడు. మొదట్లో వచ్చిపొయ్యే మిత్రుల ఎద్దడివల్ల నాకు తిండి తినటానిక్కూడా తీరిక వుండేది కాదు. ఎందరో ఎన్నెన్నో ఉచ్చులు పన్నారు. కొన్నిట్లో చిక్కుకున్నాను కూడాను... ఇల్లువిడిచి వచ్చినప్పుడు కొన్ని లక్షలరూపాయల విలువగల ఆభరణాలుండేవి; కాని కొన్ని మాసాల్లోనే ఆ నగకట్టంతా సఫా అయిపోయింది. క్రమంగా నేను ఖర్చుపెట్టటం తగ్గించాను. మిత్రు లొక్కొకరే దూరమవసాగారు. నా నిజస్థితి ఎరిగిన ప్రతివాడూ నా నీడను తొక్కటానిక్కూడా వెరిచేవాడు. మరి యిప్పుడో! హోటల్లో నా దాస - దాసీజనంకోసం ప్రత్యేకించబడ్డ గదులే యిప్పుడు

నాకు పడకగదులూ, డ్రాయింగురూములూ అయినాయి. మూడు రోజులనుండీ బిల్లు చెల్లించని కారణంగా హోటలువా ళ్ళీనాడు రెండు బ్రాందీ బుడ్లైనా సప్లయి చెయ్యటానికి నిరాకరించారు. ఇంతకంటె నా అధోగతిని, దీన చరిత్రను యింకేం చెప్పను?' ఆమె కంఠం గద్గదికమైంది. కళ్ళలో నీరుకమ్మింది. గ్లాసు పెదవులకు ఆనించింది.

'విన్నాను, అంతా విన్నాను.' అన్నాడు అతను సానుభూతిసూచకంగా – 'మీకింత చేటుచేసిన వారికి త్వర లోనే శాస్తి జరిగి తీరుతుంది.'

ఆమె మాట్లాడలేదు.

'నేను మీకు తోడ్పడవచ్చునా?'

ఆమె శిరమెత్తి 'మీరా !... ...నాకు సహాయం చేస్తారా?' అని అడిగింది.

'నిస్సందేహంగా.'

'ఏవిధంగా సహాయం చేస్తారో, చెప్పండి?'

'మీ కేసహాయం కావాలో చెపితే సమాధాన మివ్వగలను'

ఆమె ఆలోచనలో పడింది.

'మీకు నా సానుభూతిలో విశ్వాసం కుదరనందుకు నా కేమీ ఆశ్చర్యంలేదు. మీ సన్నిహితులంతా మీ మానసికతత్వా న్నీస్థితికి తెచ్చారు. మీ మీద నాకు హృదయపూర్వక సానుభూతీ, ప్రేమా వున్నవని తెలుపు కుంటున్నాను. నా ఆదరాభిమానాలు స్వీకరించారో, తృణీక రించారో నాకు తెలియదు. కాని త్రోసిపుచ్చవద్దనిమాత్రం

కోరుతున్నాను. మీ వ్యవహారాల్లో ఏ కారణంచేతనైనా నా సహకారం మీకు అక్కరలేకపోతే కనీసం మీ రోజువారీ ఖర్చులైనా భరించే అవకాశం నా కివ్వండి... కాదు, కాదు. మీరు వేరుగా భావించకండి; మీరు నజరానాగా గాని, లేకపోతే అప్పుగానైనా సరే స్వీకరించండి. మీ రిష్టు పడితే మంచిరోజులు - త్వరలోనే రాగలవు - వచ్చిన అనంతరం అప్పు తీర్చివేయవచ్చు. ఏమంటారు?'

ఆమె రోమ రోమును కృతజ్ఞతతో నిక్కపొడుచుకున్నది.

'మీ అభిమానం నిష్కళంకం. మీరు మీ హృదయంలో నా కిచ్చిన స్థానానికి మీకు కృతజ్ఞతను తెల్పటానికి మాటలు చాలవు. మీ ఉదారత్వం, గొప్పతనం, మేధాశక్తి నన్ను వశ్యం చేసుకొంటున్నవి. మీ యీ ఉపకారానికి ప్రత్యుపకారం ఎప్పటికైనా చేయగలనో లేదో!... ఇప్పుడికి మీసహాయ మపేక్షించి తీరుతాను. మీరు చేయగల్గినదంతా సంతోషపూర్వకంగా స్వీకరిస్తాను.'

అత డానందంతో ఉబ్బిపోయాడు. తమ యిద్దరిమధ్య వున్న తెర తొలగిపోయినట్లే భావించాడు. ఆ అందాలరాణి హృదయంలో తన కిక చోటు చిక్కిందనే మురిసిపోయాడు. ఆ ఉల్లాసంలో రెండు ఘాటైన డ్రింకులు తయారుచేశాడు.

అది చూచి ఆమె నవ్వింది.

అత నొక గ్లాసు నామె కందించాడు. ఆమె గుక్క తిప్పుకోకుండా తాగివేసింది.

'ఇక వినండి, నా కేయే విషయాల్లో మీా సహాయం కావాల్లో చెప్తాను '

అతను ముందుకు వంగి, టేబిలుమీాద చేతులానించి, మోర పైకెత్తి నాగస్వరంముందు నాగువలె వినసాగాడు.

# 10

'హిజ్ హైనెస్ నన్ను పూర్తిగా మరిచారు. నేను జీవించినా మరణించినా వారికి నిమిత్తం లేదు. ఇక నా బొందిలో ప్రాణంవుండగా వారి రాజ్యంలో అడుగుపెట్టను. కాని నా హక్కునుమాత్రం వదలుకోలేను. నాకు మనోవర్తి వారినుండి రాబట్టవలసిందే. అందుకు నాకు పొలిటికల్ డిపార్టుమెంటు తోడ్పాటు చాలా అవసరం. ఈ సందర్భంలో మీారు నాకు తోడ్పడగలరా?'

'తప్పకుండా.'

'క్రిందటి పర్యాయం ఢిల్లీలో వున్నప్పుడు కొందరు నన్ను మోసగించి 50-60 వేల రూపాయల నగలు కొట్టేశారు. నేను స్వయంగా కోర్టులో వారిమీాద ఏ చర్యాజరుపలేకుండా వున్నాను. ఆ మొత్తాన్ని వసూలుచేయటంలో నాకు ఆసరాగా వుండగలరా?'

'సందేహ మెందుకు?'

'ఆనాటి రాత్రి ట్రెయిన్లో మీా నా సంబంధం - యికముందు వుండే పొందులనుగూర్చి ఎక్కడా, ఎవరికీ ఆ మరణాంతం వెలిబుచ్చనని వాగ్దానం యివ్వాలి; ఏమంటారు?'

'ఇప్పుడే ప్రమాణంచేస్తున్నా' నని చేతిలో చెయి వేశాడు.

'అయితే చాలు; ఇంకే సహాయమూ అంతగా అవసరమైంది లేదు.'

'సరే, ముందుగా నన్ను యే విషయంలో జోక్యం పెట్టుకోమంటారు?'

ఆమె కేమీ తోచలేదు. సిగరెట్టు ముట్టించింది. గుప్పన పొగ వదుల్తూ సాలోచనగా పైకప్పువంక చూస్తోంది.

'మనం ముందుగా పొలిటికల్ డిపార్టుమెంటు వ్యవహారం తేల్చుకోవటం మంచిదని నా వుద్దేశం. దానికి కారణాలుకూడా వున్నై. ఒకటి – హిజ్ హైనెస్ ప్రస్తుత మిక్కడనే వుండటం. రెండోది – ఇప్పుడు సునాయాసంగా జరిగే దానికే తర్వాత అయితే యావచ్ఛక్తీ వినియోగించవలసి వస్తుంది. మీ అభిప్రాయంకూడా చెప్పండి.'

ఆమె పెద్దగా నిట్టూర్చి—'మీ అభిప్రాయం సరియైనదే' అన్నది.

'నే నొకటడుగవచ్చునా?'

'అడగండి.'

'ఇప్పుడు మీరు వదలిన నిట్టూర్పు మీ హృదయంలో దాగివున్న దైన్యాన్ని చెప్పకనే చెప్పుతున్నది. మీ యీ వ్యాకులతకు కారణం అడుగవచ్చునా?'

ఆమె జవాబివ్వకుండానే గ్లాసు చేతబట్టింది. అంతలో అన్యమనస్కయై 'మీరు వారిని చూచారా?' అనడిగింది.

'ఎవర్ని?'

'వా రిక్కడే వున్నారని మీ రింతకుముం దన్నారు?'

'ఓ, ఐ సీ! హిజ్ హైనెస్‌ను గురించా?'

ఆమె ఔనన్నట్టు తలాడించింది.

'అవును; వారిని చూట్టమే కాదు; వారిని గురించి చాలా సంగతులు విన్నాను కూడాను.'

'ఏమి విన్నారు?'

'చెపితే మీహృదయాందోళనమరింత హెచ్చుతుంది.'

'ఇంకేం విచారం! ఇదివరకే గుండె రాయిచేసు కున్నాను.'

'అయితే వినండి, చెబుతాను.'

ఆమె ఆతురత హెచ్చింది.

'ముందుగా నిన్నటివైనమే వినండి. ఉదయమే వారికి వైస్రాయి దర్శనమిచ్చారు. రాత్రి...హోటల్లో వారభామి నులతో వారు గావించిన విలాసక్రీడలు వర్ణింప నలవికా నివి. వారెన్నెన్నో కట్టుదిట్టాలుచేశారు బైటికిపొక్కకుండా. కాని యిది సిమ్లా! పొక్కనే పొక్కింది. ఎక్కడవిన్నా వారిని గూర్చిన చర్చలే. ఈ కారణంవల్ల వారిజీవితానికి కళంక మేర్పడుతుందని కూడా కొందరి విశ్వాసం. ప్రభుత్వం శ్రీవారివల్ల ఏదో సహాయం పొందదలచుకుని ఉన్నందువల్ల యీవిషయం తెలిసీ తెలియనట్టు వదిలేస్తారని మరికొందరి ఊహ.'

హర్ హైనెస్ తదేక ధ్యానంతో ఆలకిస్తూవుంది.

రెండో సీసాకూడా క్రమంగా సాంతమవుతోంది. సుర తీవ్రంగా పనిచేస్తోంది. దాని మహాత్మేమిటోగాని మహా

దుఃఖంలో మునిగినవాళ్ళనుకూడా కొంతసే పానందవాహి నిలో తేల్చి ఆడిస్తుంది.

ఆమె కొంచెం తెప్పరిల్లి అడిగింది-'అలాంటప్పుడు మీరు పొలిటికల్ డిపార్టుమెంటులో కార్యమెలా సాధించ గలుగుతారు ?

'సాధించవచ్చు.'

'ప్రభుత్వం ఏదో కార్యసాధనార్థం దీనిలోజోక్యం పెట్టుకో దన్నారే, మరి మన మాట వినే దెవరు ?'

అతనికి 'మన' అన్నమాట యెంతో రుచించింది. అప్పటి కతనికి మైకం బాగా కమ్ముతోంది. చూపుల్లో ఆ విషయం స్పష్టమవుతోంది. అతడు 'మజనూఁ'వలె ఆమె వంకచూస్తూ-'ఏసందర్భంలో యేయెత్తు బాగా పారుతుందో మనకు బాగా తెలుసుగా.' అన్నాడు. ఆమెకూడా హావభా వాల్లో 'లైలా' అయి వయ్యారంగా 'అదేమిటో నాకు చెప్పవూ ?' అంది.

అతడు నవ్వి 'పత్రిక!... తెలిసిందా ?'

'ఆఁ!' అంది ఆశ్చర్యంతో.

'ఈ యిరవయ్యో శతాబ్దంలో ప్రభుత్వాలన్నిటినీ గడగడలాడించ గలిగింది పత్రికే! కొందరు భయపడికూడా పైకి బింకం చూపుతారు. మరికొందరు హడలుపుట్టి ఆది లోనే దిగివస్తారు. ఒకవార్త వెలువడిందంటే హిజ్ హైనెస్ మనగుప్పిట్లో చిక్కినట్టే. ఇక పొలిటికల్ డిపార్టుమెంటు సంగతా ! దాని గుండెల్లో ప్రవేశించామన్న మాటే.'

అతని మాటల్లోని భావం ఆమె కవగతమైంది. తమ సంస్థానానికి విరుద్ధంగా ఏ చిన్నవార్త ప్రచురించినా అట్టివారి కెట్టి గౌరవ - మర్యాదలు, ఆదర సత్కారములు చూప బడేవో ఆమెకు తెలియనిదికాదు. స్టేటుహాస్పిటలులోని పడు చునర్సు స్టేటుమెంటు నణచిపెట్టటానికో, ఏదో ఘరానా కుటుంబానికి చెందిన సుందరాంగిని బలాత్కరించిన వార్తను తొక్కిపట్టటానికో, ఏ నిరపరాధినో హత్యగావించిన సమాచారాన్ని మభ్యపరచేటందుకో, యింకా యిలాంటి వార్తలను బయటపడకుండా నిరోధించటానికిపత్రికలకు-వార్తావాహకసంస్థలకు యెంతెంత మొత్తాలు ఖర్చుపెట్టబడినదీ ఆమె మరువలేదు. ప్రలోభనాని లొంగని పత్రికా ప్రచురణ కర్తలూ, సంపాదకులపై కేసులు బనాయించీ, చెరకంపీ, యింకా యితరమార్గాలా కక్షతీర్చుకోవటంకూడా ఆమె యెరిగినదే.

'నీవు దీని కేర్పాటు చెయ్యగలవా?'

'సునాయాసంగా. అది చేతిలో పనే.'

'ఎలా?'

'... ...' పత్రికా విలేఖరి యెక్కడేవుంటాడు. అతను నాకు పరిచితుడే. వానిద్వారా విలేఖరులను సమావేశపర్చి ఒకవిందుచేస్తే చాలు. తర్వాత ఒకచిన్నవార్త వదిత్తే సరి. దానితో కదలికలేకపోతే మరొకసారి. అంతే! మరి మనవత్తు పారిందన్నమాటే.'

'నిజం?'

'ఇంకా అనుమానం కూడానా?'

'అయితే యెలా ప్రారంభించ దలచావు?'

'నీచిత్ర మొకటి ప్రకటనకిస్తాను. దానికింద హోదాతో సహా నీపేరూ, ఏదో అజ్ఞాతకారణంవల్ల కొంతకాలంనుంచి నువ్వు సంస్థానానికి వెలుపల వుంటున్నావనీ, ఏదో ప్రత్యేక ప్రయోజనం నిమిత్తం ప్రస్తుతం సిమ్లాలో మకాం పెట్టావనీ... ప్రకటితమవుతుంది. తెలుసుగా పత్రికలవాళ్ళ సంగతి! చూపితే అందుకుంటారు. తర్వాత దుమారం లేస్తుంది. ఇక అప్పు డాపటం ఎవరితరం!'

పత్రికా ప్రభావం తలచుకొని యిద్దరూనవ్వుకున్నారు.

'లేటెస్టు ఫొటో వుందా?'

'లేదే!'

'అయితే రేపే తీయించు.'

'సరేగాని బాగా ఆలోచించు.'

'ఇంకా ఆలోచ నేమిటి? నీ కెందుకు, నేను చెప్పినట్టు చేస్తూవుండూ!'

'ఫలిత మేమవుతుందంటావ్?'

'హిజ్ హైనెస్ వెతుక్కుంటూ వచ్చి, కళ్ళ కద్దుకొని నెత్తి కెక్కించుకొని తీసుకెళ్తారు.'

'ఎక్కడికి?'

'ఇంకెక్కడికి? తమ రాణివాసంలోకి.'

ఆమె కనుబొమలు ముడిచి 'నేను వారితో కాపురం చేయటానికి దేవుళ్ళాడుతున్నా ననుకున్నావా? నో, మై డియర్! మళ్ళీ ఆ అంధకారంలో అడుగు పెడ్తానా? కల్ల. మీా రన్నది అంతఃపురంకాదు—చెరసాల. ఆ జీవితమంటే నే

నాకు రోత. వి శ్రాంతికి మూడుమూరల నేల చాలు. పైన రెండు బుడ్లు! నేను కోరే దంతే. ఇంకేమీ వద్దు...'

'మరి నేనో?'

హర్‌హైనెస్ రెండుచేతులూ అతని కంఠానికి పెన వేసింది. అతను దగ్గరకు లాక్కున్నాడు.

## 11

'హార్‌హైనెస్... వారు ఏవో అజ్ఞాత కారణాలవల్ల సంస్థానమును విడిచిపెట్టారు. ఇటీవల వారు సిమ్లాకు వేంచేసి యున్నారు. శ్రీవారి ఆగమన సందర్భంలో అనేక నిగూఢ రహస్యము లూహింపబడుచున్నవి.'

పై వాక్యాలు ఛాయాచిత్ర సహితంగా అయిదో పుటలో ప్రచురింపబడివున్న ఒక సుప్రసిద్ధ ఆంగ్ల దినపత్రిక టేబిలుపైన తెరువబడి వుంది. గదిలో పాదరక్షలు లేకుండానే హిజ్‌హైనెస్ తివాసీమీద ఇటు-అటూ పచారు చేస్తున్నారు. మధ్యమధ్య వారి దృష్టి పత్రికలోని ఛాయా పటం వైపుకు పరుగులెడుతోంది. అక్కడ మరెవరూ లేరు. వారు ఏకాంతంగానే వున్నారు.

వారిచూపు లా చిత్రంమీద పడినా, ప్రకటనమీద ప్రసరించినా మొహం వన్నెతగ్గి ఏవేవో భావాలు వెల్లడి స్తున్నది.

దుఃఖం, భీతి కలిగినప్పుడెల్లా వారి నడక మారుతున్నది. వారి అంగరక్షకుడు ప్రవేశించి నమస్కరించాడు. హిజ్ హైనెస్ వాడిని 'ఏమి'టని అడిగారు.

'ఎవరో ఒక తెల్లదొర తమ దర్శనంకోసం వచ్చాడు హుజూర్.'

'ఎవరో అడక్కపోయావూ?'

'తన పరిచయ మివ్వలేదు; గాని ఘరానావ్యక్తివలె వున్నాడు సర్కార్.'

'ఇవాళ యింటర్వ్యూ లేమీ లేవే. సెక్రెటరీ వద్దకు వెళ్ళమను.'

'నే నా మాటే చెపితే తమ దర్శనం చేసితీరాలన్నాడు. ఈ కవరు కూడా యిచ్చాడు.' అని కవరందించాడు.

అది మేలురకం కవరు. పైన హిజ్ హైనెస్ పేరు టైపు చేయబడి వుంది. వారు కవరుచించి కాగితం బయటికి తీశారు. అందులో ఒక్క వాక్యం మాత్రమే టైపుచేయబడి వుంది. కింద సంతకంకూడా లేదు. వున్న వాక్యం యిది—

'...పత్రిక నేటి సంచిక అయిదోపేజీలో ప్రకటితమైన విషయంలో తమకు ఉపయుక్తమగు సలహా నిచ్చుటకు వచ్చాను.'

ఇది చదువుకొని హిజ్ హైనెస్ వులిక్కిపడ్డారు. ఒక క్షణం నిర్విణ్ణులై తర్వాత 'పిలువు' అన్నారు.

ఆ వ్యక్తి లోపలికి వచ్చాడు. వయస్సు దాదాపు నలభై ఏళ్ళుండవచ్చు, మీసాలు, గడ్డం లేవు. దుస్తులు విలువైనవే.

'గుడ్ ఆఫ్టర్‌నూన్ యువర్ హైనెస్!' అంటూ వస్తూనే చెయి చాచాడు. హిజ్‌హైనెస్ ప్రత్యభివాదంచేసి కరస్పర్శచేశారు. తరువాత ఆగంతుకుని ఆదరపూర్వకంగా కూర్చోబెట్టి తానూ కూర్చున్నాడు. టేబిలుమీద తెరచి వున్న పత్రికను చూసి ఆంగ్లేయుని ముఖం వికసించింది. పత్రికవంక చూపుతూ 'నే నీ ప్రకటన విషయంలో మాట్లాడటానికే వచ్చానని ముందే తెలుపుకున్నాను. ఇక సంభాషణ ప్రారంభించడానికి తమ కేమేనా అభ్యంతరమా?' అన్నాడు.

హిజ్‌హైనెస్ కుషన్‌లో చేరగిలబడి సహజ గాంభీర్యంతో— 'మీ వుద్దేశం యేమిటి?' అని అడిగారు.

'ఈ విషయం పత్రికల కెక్కటం, యిక ముందు వ్యాఖ్యలు, విమర్శలు బయలేరటం తమ కిష్టం కాదను కుంటాను.' హిజ్ హైనెస్ ఆవేగాన్ని అణచుకొని పైకిగాంభీర్యం చూపుతూ—'మీ రే హోదాతో నాతో ఈ విషయం మాట్లాడడానికి వచ్చారో అడుగవచ్చునా?' అన్నాడు.

'ఓ, తప్పకుండా! తమకూ, తమ పరివారానికి శుభము కోరే ఒక గౌరవనీయుని ప్రతినిధిగా వచ్చాను.'

'నాకూ, నా పరివారానికీనా?'

హిజ్ హైనెస్ ప్రశ్నలో భయమూ, ఆశ్చర్యమూ కూడా సమ్మిళితమై ఉన్నవి. ఆంగ్లేయుడు వారి భావపరివర్తనాన్ని గమనిస్తూనే వున్నాడు.

'అవును యువర్ హైనెస్.'

'ఇంతకూ మీ అభిప్రాయం?'

'తమ మధ్య రాజీ జరగాలనే.'

'మా మధ్య!'

'అవును, తమకూ హర్‌హైనెస్‌కూ మధ్య.'

హిజ్‌హైనెస్ చలనము దక్కి, ఒకక్షణ మాలోచించి 'వెల్ మిస్టర్, నావద్దకు మిమ్ము పంపిన ఆ పెద్దమనిషినే రమ్మనండి.' తెల్లదొర ఆమాట వినగానే చివాలున లేచి నిలబడ్డాడు. హిజ్‌హైనెస్‌కు పాశ్చాత్య నాగరికత కరతలామలకమే, కనుక ఆయన దీని కేమీ ఆశ్చర్యపడలేదు.

'నన్ను పంపినవారు యిప్పు డప్పుడే తమ దర్శనం చేయజాలరని విన్నవించక తప్పనందుకు చింతిల్లుతున్నాను.'

ఈ మాటలతో హిజ్‌హైనెస్‌కు తొందరా, గాభరా కలిగినై. 'ఎందువల్ల?' అని అడిగారు.

'వారు తమ శ్రేయోభిలాషులే అయినప్పటికీ ఇప్పుడు మీ ముందుగాని, మరెవరి ఎదుటగాని బయల్పడుటకు కొన్ని కారణాలు అడ్డుతగులుతున్నవి.'

హిజ్‌హైనెస్ ధీరత్వం, గాంభీర్యం పటాపంచలైనవి.

'అయితే మీరు కూర్చోండి. ఇప్పుడే మాట్లాడదాము.'

'తమ రీ విషయంలో యింకా ఆలోచించదలచుకుంటే నేను తరువాతనేవచ్చి కలుసుకుంటాను.' అన్నాడు నిలబడి వుండే. కాని హిజ్‌హైనెస్ ఆత్రం యెక్కువైంది. చేజిక్కిన అవకాశాన్ని జారిపోనివ్వదలచలేదు.

'కాదు, మీరుండండి. ఇప్పుడే ముగిద్దాము.' అతడు కూర్చున్నాడు.

'ఇక చెప్పండి. మీరూ, మీ యజమానీ నావల్ల కోరేదేమిటి?'

'మేము హృదయపూర్వకంగా కోరేది తమ సంస్థానంలో అగ్రగణ్యమైన వారికి న్యాయం జరగాలనిమాత్రమే.'

'దీని భావం?'

'తమబోటి అభ్యుదయ సంస్థానాధీశుల పరివారంలోని ఏ వ్యక్తీ దుర్భర కష్టాలపాలవటం శ్రేయస్కరం కాదు.'

హిజ్ హైనెస్ ముఖంమీద ప్రసన్నరేఖ తళుక్కుమన్నది.

అదే సమయంలో ఆకాశాన పెద్ద మెరుపు మెరిసింది.

# 12

ఆమె తనబసను ఒకటోరకం హోటల్లోకి మార్చింది. జీవితంలో మామూలుదర్జా మళ్ళీ కనిపిస్తోంది. త్రాగుడు నిర్విఘ్నంగా సాగిపోతోంది. కాని పూర్వస్మృతి కలిగినప్పుడు మాత్రం ఆమె చింతాకులస్వాంత అవుతోంది. ఒక అపరిచితవ్యక్తిమీద ఆధారపడి ఉండటమే ఆమె దిగులుకు ముఖ్యకారణం.

ఆమె మిత్రుని—సిక్కుయువకుని పేరు శమ్‌షేర్‌సింగ్. పంజాబులో అత నొక పెద్దజమీందారు. యూరోపు అంతా చుట్టివచ్చిన పాశ్చాత్య నాగరికుడు. రసికుడు. భోగపరాయణుడు. మితిమీరిన సురాపానాసక్తుడు. సౌందర్యారాధకుడు, కళోపాసి, నిష్కపటి. స్నేహపాత్రుడు.

ఇప్పుడు హర్ హైనెస్ దర్శనం శమ్షేర్ సింగ్ నిత్య కార్యక్రమంలో ముఖ్యమైనది. తా నారంభించిన కార్య నిర్వహణం విషయంలో యేనాటి సానుకూలత నానాడే విశద పరుస్తున్నాడు. నేడే అతనికార్యదర్శి - హిజ్ హైనెస్ దర్శిం చిన ఇంగ్లీషువాని నివేదిక రావలసి ఉన్నది.

'గుడ్ యీవినింగ్ యువర్ హైనెస్' అంటూ గదిలో ప్రవేశించాడు సింగు. నే డతడనిముఃఖం కళకళ లాడుతూ వుంది. స్వరంలో ఉత్సాహం వెల్లివిరుస్తోంది.

సాధారణంగా అత డామెను దర్శించేది సాయంత్రపు వేళనే. ఆవేళకు సాకీ అక్కడ ఉండడు! హర్ హైనెస్ టాయి లెట్ చేసుకుని, సర్వాలంకార సుశోభితయై శమ్షేర్ సింగ్ కోసం నిరీక్షిస్తూ వుంటుంది. అత నిప్పుడు సాయంకాలపు షికారుకుపోడు. హర్ హైనెస్ సాన్నిధ్యమే అతనికి స్వర్గం.

వస్తూనే హేటుతీసి సోఫాలోకి విసరివేశాడు. వెంబ డించి వచ్చిన బోయ్కి ఆర్డరిచ్చి పంపాడు.

వాడు పైదొలగి పోగానే ఎదురొచ్చిన రాణి నతడు బిగియార కౌగలించుకొని ముద్దులాడాడు.

'ఏమి టీ మోటుసరసం!'

'ఇవాళ ఏమీ యెదురు చెప్పకు. విజయగర్వంతో నాయిష్టం వచ్చినట్టు నొక్కేస్తా.'

'జయమే!'

'బయట నీకూ – నాకూ కూడ జయమే! ఇప్పు డిక్కడ యెవరికో!' పక పక నవ్వుతూ ఆమె కళ్ళల్లోకి చూశాడు.

సిగ్గు దొంతర లామె చెక్కిళ్ళమీద పరుగులు తీశాయి. అయినా రసికత్వంలో రాటుదేలిన రాణి జంకు లేకుండ జవాబిచ్చింది – 'ఆఁ ఆఁ, చూద్దాంగా! ... ...సరే కాని, అసలేమైందేమిటి?'

'ఏమవుతుంది, నీరొట్టె నేతిలోపడింది.'

'అంటే?'

'నెలకు రెండువేలు.'

'ఇంతేనా?'

'ఇప్పటికింతే... మరి యిది కూడాను.' అని జేబునుండి ఒక కవరుతీసి యిచ్చాడు.

అందు పదివేలరూపాయలకు హిజ్ హైనెస్ యిచ్చిన చెక్కు వుంది.

'ఇదేమిటి?'

'ప్రస్తుతావసరానికి.'

ఆమె ఒకక్షణం ఆ చెక్కువంకచూసి, రెండుచేతులు సింగుమెడకు చుట్టివేసింది.

'నీకు నాయం దెంత ప్రేమ!'

అత డామెను గుండెకదుముకొని చెక్కిలి నొక్క బోతున్నాడు.

ఇంతలో ట్రేతో బోయ్ సిద్ధమయ్యాడు. ఇద్దరిని ఆ స్థితిలో చూచి వాడు సిగ్గుతో తల వంచుకున్నాడు. హర్ హైనెస్ వానిని చూడగానే చమత్కారంగా చేతులు వెనక్కి లాక్కొని సోఫాలో జేరగిలబడింది. బోయ్ గ్లాసులు నింపి వెళ్ళిపోయాడు.

కళ్ళల్లోని వున్మాదాన్ని ఆమెమీదికి ప్రసారిస్తూ శమ్‌షేర్‌సింగ్ ఒక గ్లాసు నామె పెదవుల కందిచ్చాడు.

'థాంక్సు' అని ఒక చెయ్యి అతని భుజంమీదవేసి మోహ వీక్షణాలు విసరుతూ తాగసాగింది.

ఈసారి అతడు ముందే తలుపు బిగించాడు. చేతుల్లోని గ్లాసులు నిగనిగలాడుతున్నవి. వారిమొహాలు కళకళ లాడుతున్నవి. పరస్పరావలోకనముల వేడిగాడ్పుకు వుడికి వుద్రిక్తులవుతున్నారు. భావయుక్తంగా పకాలుమంటున్నారు.

ఒకసీసా ఖాళీ అయ్యేసరికి కళ్ళు ఎరుపెక్కినై. మనస్సు పరవళ్ళుతొక్కుతోంది.

ఉండుండి 'కులాసాగా ఒక పాట పాడుదూ' అన్నాడు సింగు.

'పాటా! నాకురాదు!... ఊఁ, వచ్చు.'

'ఏదీ, పాడు.'

'ఎబ్బే! ఎట్లా?'

'ఏం?'

'హంగేమీ లేకుండానా? ఏం బాగుంటుంది?'

'అదేం, వుందిగా.'

'ఏమిటి, గ్రాంఫోనా?'

'ఊఁ, రికార్డు వేస్తేసరి.

ఆమె నవ్వింది. లేచివెళ్ళి రికార్డు వేసింది.

'ఇప్పుడు దొరగారికి పాట కావలసొచ్చిందేమిటి,కథ!'

ఆమె రాగ మాలాపించింది; కాని స్వరం పెగలటం లేదు. అతడు నవ్వాడు. ఆమె మానివేసింది.

'నాకు పాటా గీటా చేతకాదోయ్.'

'పోనీ డాన్సో?'

ఆమె రెప్పలు బరువెక్కి మూతపడుతున్నవి. బలవంతంగా పైకెత్తి 'ఉఁ హూఁ' అంది.

'నాకు జ్ఞాపకంలేదనుకున్నావా?' గ్లాసు ఖాళీచేసి కిందపెడ్తూ సింగు అన్నాడు – 'లోగడ నాతో...'

సోఫాలో వెనక్కి జేరగిలబడిన హర్ హైనెస్ ముందుకొచ్చి – 'అవునవును, డాన్సుచేస్తా' నంది.

రికార్డు అయిపోయింది.

'లే మరి, డాన్సు చెయ్యి.'

'మరి నువ్వో?'

'నేను కూడా కావాలీ?'

అత డామెను ముద్దెట్టుకున్నాడు. ఆమె తప్పించుకొని వెళ్ళి డాన్సింగ్ రికార్డు వేసింది. తిరిగి సింగువద్దకుపోయి చేతులు పట్టుకొని లాగింది.

డాన్సు ఆరంభమయింది. కొంతసేపటికి వాళ్ళిద్దరూ అలసిపొయ్యారో లేదో కాని శరీరాలు వేడెక్కినాయి. ఇద్దరికీ తూలుపుట్టింది. కామోద్రేకము కళ్ళు గప్పింది.

శమ్‌షేర్‌సింగు ఆమెను తన బాహుబంధంలో యిరికించుకొని పడకగదిలో దూరాడు.

'మైడియర్' సింగ్‌తో ఆమె అంది—'నీ ప్రేమ...' పైన వంగివున్న సింగు ఆమెను ముద్దిడుకోవటంతో ఆ పైమాట ఆగిపోయింది.

'డ్రింక్, డ్రిం...క్!'

సింగు పరుగునపోయి ఘాటైన డోసు తెచ్చి యిచ్చాడు.

కళ్ళువిప్పి చూచి నవ్విం దామె. మోచేతులమీద ఆనుకొని అతడు గ్లాసుపట్టుకొని వుండగా మంచినీళ్ళ ప్రాయంగా పీల్చివేసింది—చుక్క దిగబడకుండా.

అతడు మళ్ళీ బయల్దేరబోయినాడు తేవటానికి; కాని ఆమె గ్రహించి చెయిపట్టుకొని 'చాలు' నన్నది.

'ఏం?' అని ప్రశ్నార్థకంగా చూచాడు.

'ఎక్కువైతే మజా పోతుంది.'

అతడు నవ్వాడు. యిక మానసికోద్రేకాన్ని ఆపలేక పోయాడు. పైనబడి గట్టిగా కౌగలించుకొని ముద్దులవర్షం కురిపించాడు.

అతని చుంబనోద్రేకము వుపశమించగనే ఆ కామాంధ కన్ను కలుపుతూ 'యింతేనా?' అంది భావయుక్తంగా.

ఆ 'యింతేనా'కు సమాధానంగా అతడేమో చేయ బోతున్నాడు; కాని అంతలో తలుపుమీద దబదబ గుద్దులు విన్పించటంతో రసాభాసమైనది. 'తెరవండి, త్వరగా తలుపు తెరవండి.'

ఉలిక్కిపడి యిద్దరూ ద్వారంవైపు చూచారు. తలుపుమీద గుద్దులు పడుతూనే వున్నై. సింగుకు మత్తు విడి

పోయినట్టయింది అతడు మంచం దిగి ద్వారంవైపుకు నడిచాడు.

'ఎవరు?' కోపంతో గద్దించి అడిగాడు.

'తలుపు తియ్యి త్వరగా!'

'ఎందుకూ?'

'అర్జెంటు పని వుంది.'

'ఎవరితో?'

'నీతోనే; త్వరగా తెరవాలి.'

హర్ హైనెస్ నిషా పటాపంచలైనది. ఆమె స్వరం గుర్తించింది. గబుక్కునమంచందిగి ఒక్కగంతులో ద్వారం వద్దకుపోయి నుంచున్నది. సింగువంక ప్రశ్నార్థకంగా చూచింది.

'గడియ తియ్యండి, అది సాకీ గొంతు.'

సింగుకు ఆగంతుకునిపై నమిలిమింగాలన్నంత కోపం వచ్చింది. తలుపు తీశాడు. సాకీ లోపలికి వచ్చాడు. బయట కుంభవర్షం కురుస్తోంది. సాకీ లోపలికి వస్తూనే లోన గడియ బిగించాడు. అతను ధరించివున్న వానకోటునుండి నీటి చుక్కలు జారి కిందపడుతున్నవి.

సింగు రెప్పవాల్చకుండ సాకీవంక చురచుర చూస్తున్నాడు.

'నేను నీకోసమే వచ్చా' నన్నాడు సింగువైపు తిరిగి సాకీ. అంటూనే కోటుజేబులో వున్న చెయి పైకితీసి రివాల్వరును సింగువైపుకుగురిపెట్టికాల్చాడు. నిప్పురవ్వలులేచాయి.

ధన్‌మన్న ధ్వనితోపాటు. నోటమాటైనాలేదు; ఆపళంగా శమ్‌షేర్‌సింగు చిత్తై నేలకొరిగాడు.

అంతా క్షణంలో జరిగిపోయింది.

సాకీ కోరిక నెరవేరింది. ప్రత్యర్థి అంతరించాడు.

# 13

హార్‌హైనెస్ భయంతో ఒక అరుపు అరచింది. జోరుగా కురుస్తున్న వర్షపుధ్వనిలో ఆ కేక కలిసిపోయింది. అస లక్కడ వింటానికూ్కడా యెవరూలేరు. వర్షాధిక్యతవల్ల రోడ్డుమీద ఒక్క పిట్టకూడా లేదు. హోటలు గంద్రగోళం వల్లా, వర్షపుధ్వనివల్లా, రివాల్వరు పనితనమూలంగానూ కాల్చిన చప్పుడుకూడా క్రింది అంతస్తుల్లో వున్నవారి కెవరికీ విన్పించిందికాదు.

హార్‌హైనెస్ కంగారుకు అంతులేదు. నిలువుగుడ్లెట్టి నిలబడి చూస్తోంది.

'ఏమి టీ పని?' అని వొణుకుతూ అడిగింది ఎట్లాగో.

సాకీ పై శాచికాట్టహాసంచేస్తూ వికటంగా నవ్వాడు. నిర్భయంగానూ, గంభీరంగానూ 'నేను నా కర్తవ్యాన్నే నిర్వహించా' నన్నాడు.

'ఇప్పుడు జరగవలసిన దేమిటి?'

'ఏమో! నే నేమీ ఆలోచించుకోలేదు.'

'అయితే... చావదలచుకున్నావా?'

'ఖూనీచేసి పట్టుబడకుండ మెక్కడికి పోతాను ?'

'అసలు నువ్వీపని యెందుకుచేశావు సాకీ?' అంటూ అతనిదరి కెళ్ళింది. సింగు శవాన్ని చూచి ఆమె భయకంపిత అవుతోంది. గుండె మహా వేగంగా కొట్టుకుంటోంది.

'నే నిలా యెందుకుచేశా నంటారా? ఎందుకుచేశానో చెప్పనా?' అని సాకీ వున్మత్తునివలె- 'నేను ఖూని చేసింది యిందుకే!' అని హర్‌హైనెస్‌ను గట్టిగా కౌగలించుకొని ముద్దెట్టుకోసాగాడు.

వాని యీ మోటుతనము, వెకిలిచేష్టలు ఆమెను మరింత ఆందోళనపరిచాయి. నోట మాటరాలేదు. బిక్క ముొగంతో తెల్లగు డ్లెట్టి చూస్తోంది.

'భయపడకండి' అన్నాడు సాకీ- 'నా ప్రాణమయినా వదుల్తాను, గాని తమమీంద యీగనుకూడా వాలనివ్వను.'

'దౌర్భాగ్యుడా!' అన్నది ఆమె దుఃఖాతిశయంతో.

'నా గురించి నాకు చింతలేదోయ్ వెర్రినాగమ్మ ! నువ్వీ ప్రాణసంకటమైన పనెందుకుచేశావా అనే నా ఆరాటం'

సాకీ పద్ధెనిమిదో శతాబ్దపు ఫ్రెంచి నాటక పాత్రధారి వలె చేతులు చాపి అన్నాడు-'కేవలం మీకోసమే హుజూర్'

'నాకోసమా ?'

'అవును. రాణీజీ, తమ కోసమే !'

ఆమె చేష్టలుదక్కి అతనివంక చూస్తోంది.

'ఈ పెద్దమనిషిని ఎందుకు చంపానో చెప్తా వినండి.'

ఆమె కానిమ్మన్నట్టు చూచింది.

'అయితే వినండి,' అని సాకీ హర్‌హైనెస్ చేతులు తన చేతుల్లోకి తీసుకున్నాడు. కొద్ది నిమిషాల క్రితం హర్‌హైనెస్ - శమ్‌షేర్ సింగులు కలిసి సురాపానంచేస్తూ, సరస సల్లాపాలాడిన సోఫాలోనే ఆమెను కూర్చోబెట్టి పక్కనే తానూ ఆనుకొని కూచున్నాడు.

'నేను తమర్ని హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను హుజూర్. తమకొరకే యిల్లు—వాకిలి, భార్యా-పిల్లలు, అందర్నీ వదలి వచ్చాను. తమ రిప్పుడు కష్టదశలో వున్నారని తెలుసు; కాని తమ కెన్నడు యే లోపం జరక్కుండా చూస్తూ వచ్చాను. తమరు మహాభోగము లనుభవించిన మహారాణి అని, దారిద్ర్యదావానలమును భరించ లేరనికూడా మరిచిపోలేదు. అందువల్లనే మీరూ నేనూ నిత్యసంతోషంతో ఆనందడోలికల నూగులాడుతూ జీవితం సుఖంగా వెళ్ళబుచ్చాలని తపించి ఎలాగో మార్గం వెతికాను. నేను అంతరించవలసివచ్చినా వెనుకాడను; కాని మిమ్మల్ని సుఖ పెట్టటంలో ఏమరగలనా? ... కాని ... యీ నా మార్గంలోని కంటకాన్ని (మృతవ్యక్తి నుద్దేశించి) సహించలేకపోయాను. (ఆమెవంక దీనదృక్కులు బరపుతూ) వీని మోహపాశాల్లో జిక్కిన తమ కీ మధ్య నా స్పర్శ అంటేనే గిట్టటంలేదు. మరి నే నిది ఎలా సహించగలనుచెప్పండి?'

'ఓరి భగవంతుడా!' అంది హర్‌హైనెస్ నిట్టూరుస్తూ. 'ఇప్పుడు నీ వుద్దేశం ఏమిటి?'

గొప్ప వీరునిలాగ రొమ్ము ముందుకు చాచి సాకీ అన్నాడు 'మరణించటమే. ఇంతకంటే వుద్దేశమేముంది?'

'నువ్వుకూడా నన్ను నట్టేట్లోముంచి చచ్చిపోతావా?'

'నన్నుగురించి విచారమెందుకు? నేను చస్తే తమకు పీడ వదలిపోతుందిగా!'

అతడు కటికవానివలె కళ్లు వెళ్ళబెట్టి చూచాడు. ఆ చూపుకు హర్ హైనెస్ ఆపాదమస్తకం కంపించిపోయింది.

'నీ మనసులో విషయం చెప్పు సాకీ!'

అతడు వికటంగా నవ్వాడు.

'నా విశ్వాసానికి, సేవకు తమ హృదయంలో స్థానం లేదు; గౌరవంసున్న. ఇక నాకీది ప్రేమ మృగ్యమయింది. అలాంటప్పుడు యీ తుచ్ఛ ప్రపంచంలో నేను బ్రతికి ప్రయోజనం యేమిటి? సర్వం ఎవరి నిమిత్తం త్యజించి వచ్చానో, వారే తిరస్కరించుతున్నప్పుడు యిక బతికుండి యేం బావుకోను?'

'ఎంత నిష్ఠురంగా మాట్లాడుతున్నావోయ్ సాకీ?'

'నిష్ఠురమా హుజూర్! నేను లేనివిషయం యేమన్నాను? రెండువారాలనుంచీ చూస్తున్నాను. మొదట్లో మీరీ కుక్కను (శివాన్నుద్దేశించి) యేదో కార్యసాధనోద్దేశంతో చేరనిచ్చారని తలిచాను; కాని నా తలంపు తలక్రిందైనది. తమ రతన్ని గాఢంగానే ప్రేమించారు. వాడి ముందు నేను—నేనేమిటి యావత్ప్రపంచం — పనికిమాలినదైనది... నేనిది ఎట్లా ఓర్చగలను హుజూర్?-ఈ అవమానానికి నేను అర్హుడనేనా చెప్పండి?'

ఆమె అతని కళ్ళల్లోకి తేరిచూస్తోంది.

'నేను తమ సేవకమాత్రుడనని యెరుగుదును. ఒక ప్పుడు నా సేవకు ప్రతిఫలంగా వేతనం పుచ్చుకొనేవాణ్ణి, కాని ఏడాదినుండి తమనెప్పుడు గాని యేమైనా అడిగానా? తిండి దొరికితే తిన్నాను; లేకపోతే మానాను. ఇంటికి పిల్లల కని దమ్మిడీ పంపలేదు. ఇదంతా తమకు తెలియదూ? తమనే సర్వస్వంగా భావించుకున్నందుకు... కాని... తమరే చెప్పండి,యిందులో నాతప్పేముందో... తమరూపమే నా కీ సాహసాన్నిచ్చింది. తమ దివ్యసుందరవిగ్రహమే నన్నీరీతిని వెర్రివాణ్ని చేసింది. ఒకసారి - జ్ఞప్తికి తెచ్చుకోండి - ఢిల్లీ లోని... హోటల్లో గడిపిన రోజులు-తమరు మోహావేశంతో పరవశులై నన్ను బాహువల్లరితో పెనవైచుకొని పడకపై బడిన రాత్రులు - నన్ను 'ప్రియా'అని నోరారపిల్చి, తమను కూడా అట్లే సంబోధించమని మారాముచేసిన ఘడియలు... యివన్నీ మర్చిపొయ్యారా?'

ఆమె దృష్టిని రోడ్డుమీదికి మళ్ళించింది. వానతీవ్రత తగ్గలేదు. రోడ్డు జనశూన్యంగా వుంది. ఆమె బుర్రలో ఆలో చనలు పరుగులెడుతున్నాయి. అతనిచెయ్యి పట్టుకొని 'అయినదేదో అయింది, యిక ప్రాణందక్కే మార్గంచూడు' అంది.

# 14

ట్రెయిన్లో ఎక్కినతర్వాతనే హిజ్ హైనెస్ కావార్త తెలిసింది. వారు స్వస్థానానికి ప్రయాణం చేస్తున్నారు. దారిలో కొన్న పత్రికలో ఈ హత్యాసమాచారం మృత వ్యక్తిచిత్రసహితంగా ప్రకటింపబడివుంది. హతుని ప్రయత్నించి కూడా పోల్చలేకపోయినారు. అతడే తమకూ, హర్ హైనెస్‌కు మధ్య సంధిని పొసగజేయుటకు కృషిచేసిన వ్యక్తి అని వారి కేం తెలుసు?

'...మహారాణీగారు కొన్నినాళ్ళనుండి... హోటల్లో మకాంచేసి వున్నారు. వారితో వారి కార్యదర్శి మహమ్మద్ సాకీకూడా వుంటున్నాడు. ఆ హోటలులో ప్రవేశించిన లగాయతు మృతవ్యక్తి అనుదినము హర్ హైనెస్ వారి దర్శనము చేయుచుండెను. హత్యజరిగిననాటి సాయంత్రం వారిద్దరుకలసి మెలసి ముచ్చటించుచుండుట హోటలునౌకరులు గాంచి యుండిరి. వర్షమువలనను, పైన పనియుండనందునను నౌకరు లెవరూ ఆ రాత్రి వారి గదివైపు వెళ్ళియుండలేదు. ఉదయము గదులు శుభ్రపరుప సేవకుడు పోయిచూడ శమ్‌షేర్ సింగు కళేబరము ముందుగదిలో పడియున్నది. హర్ హైనెస్ గాని, వారి కార్యదర్శిగాని కనిపించలేదు. ఖాళీ సీసాలు, గ్లాసులు, సిగరెట్టు ముక్కలు, విడిచినబట్టలు, మరికొన్ని వస్తువులు చిందరవందరగా పడివున్నవి. తత్తరపాటులో కొన్ని వస్తువులను తీసికొనకుండానే వారిద్దరు పలాయనం చేసినట్లు వూహింపబడుచున్నది.'

ఇదీ పత్రికలో ప్రచురింపబడిన వార్త. పెద్ద పెద్ద అక్షరాలతో తొలిపుటలోనే ప్రకటితమైనది. ఈ హత్యా సందర్భంలో యేదో నిగూఢ రహస్యమున్నదనివ్యాఖ్యానింప బడినది.

రక్షకభటులు అతిజాగరూకతతో అన్వేషణ సాగిస్తు న్నారని తాజావార్త.

ఈవార్త చూడగానే హిజ్ హైనెస్ నిశ్చేష్టులైనారు. ప్రతిక చేతినుండి జారి కిందపడింది. ఈ సంఘటన తమ కీర్తికి కళంకం కాగలదని వారూహించారు. తాము సంద ర్శించినపుడు వైస్రాయి వెలిబుచ్చిన సుహృద్భావంలో కూడా యీ ఘటనకారణంగా కొంతమార్పు కలిగినా కలుగ వచ్చని భీతికలిగింది. సంస్థాన వ్యవహారం అసలే అధ్వా న్నంగావుంది. ఋణభారం క్రుంగదీస్తోంది. సంస్థానసిబ్బందికే ఆరుమాసాల వేతనం బకాయిపడింది. లంచగొండితనము, దోపిడీలు ముమ్మరంగా సాగుతున్నాయి. ఒక్కరొక్కరే సంస్థానంవదలి వెళ్ళిపోతున్నారు. ఈ విషమస్థితిలో అన్ని విధాల సహాయం చేస్తానన్న వైస్రాయి వాగ్దానం భంగమై పోతుందేమో! తాము గండంగడచి గట్టెక్కాలని ప్రభుత్వ మరతు లన్నిటికీ తలొగ్గారుకూడాను. అవసరమైతే ప్రభుత్వం నియమించే ప్రత్యేకాధికారికి అధికారమంతా హస్తగతం చెయ్యటానిక్కూడా వెనుదియ్యలేదే! మధ్యలో యీ పిడి మేలం యేమిటి? దీని మూలంగా ఆశాసౌధమంతా నేలకూలి అసలు స్టేటుకే తులసినీళ్ళు వదలాలాయేం;

ఇవన్నీ వారిబుర్రలో సుడిగుండంలా తిరుగుతున్నవి. తర్వాత స్టేషన్లో బండి ఆగగానే కార్యదర్శిని తమవద్దకు పిలిపించుకున్నాడు. అతడు యువకుడు. నవనాగరికత కొట్టపట్టు, వ్యవహారాలకు కొత్త.

హిజ్ హైనెస్ పేపరు అతని కందించాడు. అంతా పూర్తిగా చదివేవరకూ అతని ముఖభావమును పరికిస్తూ వున్నారు.

'హారిబుల్! యిటీజ్ హారిబుల్ యువర్ హైనెస్!'

'ఏమవుతుందంటావు?'

'ఇప్పుడేం చెప్పగలం హుజూర్!' ఆయాసపడిన వాని లాగ అన్నాడు కార్యదర్శి.

హిజ్ హైనెస్ ఆశాజ్యోతి కళావిహీనమైంది. 'దుర దృష్టదేవత మన ముందే నడుస్తోంది' అన్నాడు.

కార్యదర్శి మృతవ్యక్తి చిత్రాన్ని చూపుతూ 'తమ రితన్నెరుగుదురా హుజూర్?'

'లేదు, నా కతనితో పరిచయంలేదు.'

'నే నెరుగుదును.'

'ఎరుగుదువా? ఎవ రతడు?'

'పంజాబులో......జిల్లాలోని పెద్ద జమీందారు. ఈ సంవత్సరమే 'రాజా' పదవి రానున్నది. సిమ్లా సొసైటీలో మంచి పేరు ప్రఖ్యాతులుగలవాడు. తమరు పబ్లిక్ ఫంక్షన్స్‌లో పాల్గొనటం లేదుకాబట్టి తమ కతని పరిచయంలేకపోయింది.'

'ఈ సంఘటనకు మూలకారణం ఏమైవుంటుంది?'

'విషయం చాలా క్లిష్టంగావుంది సర్కార్.'

'అది నాకూ తెలుసు' అని తీవ్రంగా అన్నారు.

'నా అవివేకాన్ని మన్నించండి...'

'ఈ హత్యలో హర్ ...'

'అసంభవం, అలా ఎన్నడూ జరిగివుండదు హుజూర్.' మధ్యలో అందుకొని కార్యదర్శి నాలుక కొరుక్కున్నాడు.

'కాని అనుమానానికి అవకాశంవుంది.'

'ఏమైనా కానివ్వండి; వారి విషయంలో నాకేమాత్రం సందేహం కలగటంలేదు హుజూర్.'

'కాని నా గౌరవానికి...'

పూర్తిగా చెప్పనివ్వకుండానే కార్యదర్శి-'తమ గౌరవానికేమీ భంగంరాదు యువర్ హైనెస్' అన్నాడు.

'ఏమిటి ధైర్యం?'

'రాణీసాహెబ్ తమనుంచి వేరుగా వుంటున్నారని ప్రపంచమంతా ఎరుగును. ప్రస్తుతం వారితో తమకు సంబంధం లేదని పత్రికలుకూడా చాటిస్తున్నై.'

హిజ్ హైనెస్ ఒక క్షణం ఆలోచించి అన్నారు - 'అయినా నా పేరు యీడ్చకుండా వదలరు.'

హర్ హైనెస్‌కు వ్రాసి పంపిన 10 వేల రూపాయల చెక్కు సంగతి వారిస్మృతికి వచ్చింది. దానితో వారి మనో ధైర్యం మాయమైంది. మొహం వివర్ణమైంది. నోరు తడి ఆరింది.

# 15

'నిజంగా అది ప్రమాదమే.'

'ఏదీ?'

'ఆ చెక్కునుగూర్చిన భోగట్టా పోలీసువాళ్ళకు తెలిస్తే హుజూరు వారికి హర్ హైనెస్‌తో యిప్పటివరకూ సంబంధం వున్నట్లే ఋజువు అవుతుంది.'

'అంతమాత్రానికే ఈ హత్యాకాండకు బాధ్యత మనపైకి వస్తుందంటావా?'

'అలా అనుకోటానికి వీల్లేదు. పురుషునికి భార్యతోటి సంబంధం తెగిపోయినా ఆర్థికసహాయంచేయుటం అపరాధం కానేరదు.'

హిజ్ హైనెస్ కేమీ తోచటంలేదు. ఒకవైపున తన కష్టాలు, రెండోవైపు వంశమర్యాద!...ఇన్నినాళ్ళకు మళ్ళీ వారి హృదయంలో హర్ హైనెస్ పట్ల సానుభూతి కలిగింది. ఇప్పుడా నిర్భాగ్యురాలు ఎక్కడ—ఎట్టి కష్టదశలో చిక్కుకొని వున్నదో! పూర్వం తాము కలసివుండగా అనుభవించిన ఆనంద ఘడియలు ఒకటొకటిగా ఆయనకు జ్ఞాపకం రాసాగాయి. రైలు మామూలు వేగంతో పరుగిడుతోంది. చిన్న స్టేషన్లువస్తున్నవి, పోతున్నవి. హిజ్ హైనెస్‌లో భావతరంగాలు ఒకటొకటిగ వచ్చిపోతున్నవి.

శ్రీవారి మనసు మధుపానంమీదికి మళ్ళింది. వారి సూచనతో కార్యదర్శి సీసాలు, గ్లాసులుతీసి డ్రింకు తయారు చేశాడు.

సంక్షుభితమానసులైన హిజ్ హైనెస్ గ్లాసును పెదవుల కందించారు. యువ కార్యదర్శికూడా వారి ననుకరించాడు. అప్పుడు శ్రీవారి కెట్టి డోసుపడవలెనో తెలిసిన కార్యదర్శి అందు కనుగుణ్యంగానే తయారుచేసి యిస్తున్నాడు. ఆందోళిత హృదయానికి అవ్యక్తానందం కలిగించగల దీ మద్యమే గద!

ఒకటి, రెండు, వరుసగా మూడు గ్లాసులు ఎగిరిపోయ్యాయి. అప్పటికి వారిలో చురుకుదనం తలెత్తింది.

'సెక్రటరీ!' గద్గదస్వరంలో అన్నారు—'పెద్దచిక్కే వచ్చిందోయ్!'

నిషా బాగా తలకెక్కిందని గ్రహించాడుకార్యదర్శి.

'నిజమే సర్కార్!' అన్నాడు సానుభూతిపూర్వకంగా చూస్తూ.

'పర్యవసానం యేమవుతుందో చెప్పనా?'

'చిత్తం, సెలవివ్వండి.'

'నిర్వాసం, అవమానం—తర్వాత యే కానిదేశం లోనో దుర్మరణం.'

'అలా అనకండి హుజూర్. మనం భీతిచెందవలసిన పనిలేదు.'

వారు నాలుగోపెగ్గు పూర్తిగావించి 'అలా జరిగితే మాత్రం విచార మెందుకు? ఈ కష్టాలన్నా తప్పుతాయి. రోజురోజూ క్రుంగదీసే బాధఅయినా విరగడఅవుతుంది.'

'మన మలా యెందుకు భావించాలి సర్కార్?' అని కార్యదర్శి సీసాను గ్లాసులోకి వంచాడు.

'నీకు తెలియదోయ్! నా మనస్సులోవున్నది నాకే తెలుసు. నువ్వింకా చిన్నవాడివి. అనుభవజ్ఞానశూన్యుడవైన నువ్వు నా మనోవ్యథను అర్థంచేసుకోలేవు.'

కార్యదర్శి సిగ్గుతో తలవంచుకున్నాడు. అతడు యజమాని వేదనకు విరుగుడు కనిపెట్టటానికి భూమ్యాకాశాలు గాలించాలనుకున్నాడు.

'అసలు నేనామె నెందుకు తిరస్కరించి తరిమివేశాను! కనీసం మా సంబంధాన్నైనా స్మరించకపోతిని. నా బుద్ధి యేమయిందో! నా కళ్లు మూతలుపడినవి కాబోలు. నాలో యుక్తాయుక్త విచక్షణా జ్ఞానమే నశించిందా? ఏది జరిగినా నా కీర్తికే కళంకమని గ్రహించలేని మందమతినయాను... ఆమెను నావద్దనే ఎందుకు వుంచుకోలేకపోయానో చెపుతాను విను.'

రాజుగారు చెప్తానంటే అతడు విన కేం జేస్తాడు? 'చిత్త'మని ఊఁ కొట్టాడు.

'ఇప్పుడామె పరిత్యక్త, పతిత; కాని ఒకప్పుడు మహారాజ్ఞి, నా హృదయాధి దేవత. అప్పుడు నాకు ఆమెముందు ప్రపంచంలోనివన్నీ దిగదుడుపే.

'ఒకనాడు తలవని తలంపుగ ఆమె నా కళ్ళబడింది. ఆమె రాజసుతా కాదు, ఘరానావంశ కన్యా కాదు. హీన వంశంలో – నిరుపేద కుటుంబంలో జన్మించింది. అయితే యేం! అందానికి అప్సరస! ఆనాడు మెరుపులా తళుక్కుమని మెరిసిన ఆమెరూపం నన్ను వెర్రివాణ్ణి చేసింది.'

కార్యదర్శికి అంతకుపూర్వం మహారాణి పుట్టుపూర్వో త్తరాలు తెలియవు. చకితుడై శ్రద్ధగా ఆలకిస్తున్నాడు.

'మా వంశగౌరవం పాడుకాకుండా చూడటానికిగాను దేవకన్యలాంటి ఆ ముద్దుగుమ్మను కోరిన ధనమిచ్చి కొని వేశాను. సంస్థానంలో ఒక ఉన్నతోద్యోగికి పెంపకానికిచ్చి తర్వాత చేపట్టాను... వింటున్నావా?'

కారదర్శి గుడ్లు మిటకరించి, చెవులు రిక్కబెట్టి వింటూనూ వున్నాడు, విస్మయమూ చెందుతున్నాడు.

'ఆ అందాలరాశి నా అంకశాయిని అయిననాడు - ఓ! ఆనాడు నా మనోహరి ముందు విశ్వసామ్రాజ్య కిరీట మైనా బలాదూరే సుమా!' (పూర్వస్మృతితో వారికన్నులు మెరిశాయి) 'ఆమె నా దైన దన్న సంతోషంలో కారా గారాల గేట్లన్నీ బార్లాగా తెరిపించాను. రాజ్యమందంతటా ఆనందోత్సవాలు జరపుకోటానికి ఆజ్ఞ యిచ్చాను. పౌరు లందరికీ ఫలాహారాలు పంచిపెట్టబడినై. దాస దాసీలకు కోరిన బహుమతులు దక్కాయి. మరి నాకో! ఆమె ప్రక్కనున్న నాకు స్వర్గం అరచేతిలో కనిపించింది.

'అయితే అది యెన్నాళ్ళో నిలవలేదు. రెండు మూడు వసంతాలు తిరిగి వచ్చాయో లేదో యిద్దరిమధ్య తెర అడ్డు పడింది. ఆమెలో ఏదో వింతమార్పు కనుపించసాగింది. ఆమెకు రాజాంతఃపురమంటే రోతపుట్టింది. అంతవరకు ఘోషా అంతఃపురాచారము. దాసీ జనం, ఖొజ్జాలకుమినహా అందులోకి ఎవరికీ ప్రవేశం లేదు. జనానా పరపురుషుల కంటబడరాదని ఆదినుంచీ వున్న కట్టుబాటే. రాజవంశ గౌర

వాని కదొక చిహ్నం; కాని, ఆమె కది బంధనంగా తోచింది. పరదానుండి బయటపడటానికి ఆమె తహతహలాడింది. తన ప్రబలేచ్ఛను నాకు విన్నవించింది. మొదట విసీ విననట్టు త్రోసిపుచ్చాను; కాని నెమ్మదిమీద ఆ మోహనాంగి కోర్కెను నిరాకరించలేక అంగీకరించాను. ఏదో నెపంతో ఆమెను మసూరీకి తీసుకొని వెళ్ళాను. అక్కడే ఆమె ఘోషాకు తిలాంజలి నిచ్చింది.

'అయితే అంతటితో ఆగితే బాగానే వుండిపోను. పరదా తీసివేయటంతోపాటు స్వేచ్ఛావిహారంకూడా ఆరంభమైంది. రాజధాని నగరంలో విందులకు వెళ్ళటంతో ప్రారంభమై, క్రమంగా దేశమందంతటా సభలకూ, సమావేశాలకూ హాజరవటం, ఘోషాపద్ధతిని రూపుమాపే ఉద్యమాన్ని లేవదీసి నడపటం, నారీలోకానికి నాయకత్వం వహించటంవరకు వెళ్ళింది వ్యవహారం. పత్రికల్లో ఆమె చిత్రాలు, ఉపన్యాసాలు, ఆమెనుగూర్చిన ప్రశంసలు ప్రకటింపబడుతూవుంటే చూచి సంతోషంతో నేనూ హాంగి హాయ్యేవాడిని. క్రమంగా ఆమెకు మగవాళ్ళతో తిరగటం కూడా అలవాటయింది.

'ఇక ఆపైన సహించలేక పోయాను. నిరోధించ యత్నించాను. అప్పటి కింకా ఆమె సౌందర్యారాధనలో నిమగ్నుడనే. అయినా దేనికైనా పరిమితి వుంటుంది. ఒక రోజున ఆమె స్వేచ్ఛ హద్దుమీరి... సంచరించినట్లు చెవిని పడింది. అంతే. మళ్ళీ ఆమెముఖం చూడలేదు' అని చెప్పి ఆయన టక్కున ఆపివేశారు. అతి తాగుడు నిషా, చెలరేగిన

మానసిక అశాంతీ కలిసి వారి ముఖంమీద విచిత్రకళను తెచ్చిపెట్టాయి. మనోనిబ్బరం నశించిపోయింది. ఇక కూర్చుండలేక తూలుతూ పక్కమీది కొరిగారు. తడబడే స్వరంతో మూతలుబడుతున్న కళ్ళతో అతి ప్రయత్నంమీద 'ఇంకొక....పెగ్...యి...య్యి...వ్వా...వ్వా...వ్వా...?' అన్నాడు ఆయన.

# 16

సిమ్లా రాజకీయాలకు ఎంత ప్రాముఖ్యత వహించిందో, వైశాల్యంలో అంత చిన్నది. అది భూతలస్వర్గం! భారత ప్రభుత్వ కీలకస్థానాలన్నీ అక్కడ కేంద్రీకృతమై వున్నట్టే, భారతదేశ సౌందర్యశోభ అంతా అక్కడ దృగ్గోచర మవుతుంది.

మన దేశంలో బ్రిటిషువాళ్లుచేసిన తంత్రాంగం ఇక్కడే చూడాలి.

ఉదయంనించి సాయంత్రంవరకు సిమ్లానగర వీధుల్లోని కలకలము, ఆనందోత్సాహాలు తిలకించి తీరవలసిందే. ఒక మూల నిలబడి చూస్తూవుండండి – ఒకప్పుడు మీ కళ్ళు జిగేలుమంటవి. మరొకసారి మీ హృదయాలు కుప్పిగంతులు వేస్తాయి.

నారీమణులు కాళ్ళకు రెక్కలు తగిలించుకొని ఆ తారు రోడ్లమీద ఎగిరెగిరి నడుస్తూవుంటే, దిగ్భ్రమచెంది ముక్కుమీద వేలు వేసుకోక మానరు. రెపరెపలాడే

మేలి ముసుగులతో, నిగనిగలాడే చీరలతో రంగు రంగుల ఫ్రాకులతో, పొట్టి - పొడుగు రవికలతో, పౌడరద్దిన మొహాలతో రంగుపూసిన పెదవులతో, సువాసన ఘుమఘుమలతో, వింతవింత వయ్యారాలతో స్వదేశ-విదేశాలకు చెందిన రంగు రంగుల సీతాకోకచిలుకలు సిమ్లా శీతల వాయువీచికల తావులతో మైమరచి - ఈ యిహాలోకాన్నే విస్మరించి చరిస్తూవుండే ఆ మనోహర రమణీయ దృశ్యాలు కనుల పండుగలే!

ఇక పురుష పుంగవులో! వారి విలాసాలకూ కొదువ లేదు. నూరురూపాయలలోపు భృతినిపొందే గుమాస్తాలు వగైరాలు - యెలాగో మప్పితంగా కాపురం చేసుకుంటున్నా భీమా ప్రిమియాలు చెల్లించుకోవటమే బ్రహ్మ ప్రళయంగా వున్నవారిని - పిల్లలను భుజాలమీద యెక్కించుకొని భార్యా సహితంగా కాలినడకనే వాహ్యాళికి పోయి వచ్చి అదే తమ జీవితానందంగా సంతృప్తిచెందేవారిని - యింతకంటె హీనజీవితం వెళ్ళబుచ్చేవారిని వదిలేద్దాం. ఆ దరిద్ర దామోదరుల జీవితఘట్టాలను వర్ణింప రచయితకు తీరికాలేదు, పాఠకులకు చదవటానికి యిచ్ఛాలేదు. పాఠకుల రుచుల కనుగుణ్యంగా రచించటమే రచయితల కర్తవ్యం. మరి పాఠకులో? వారు సర్వసామాన్యంగా పాదుషాలు, నవాబులు, మహారాజులు, జమీందార్లు, భూస్వాములు, శ్రీమంతుల జీవితమైదానాల్లో తవ్విన గోతుల లోతును పరిశోధించటంలోనే ఆహ్లాద మనుభవిస్తారు. కాబట్టి ఆ హైక్లాస్ పురుషశ్రేష్ఠుల జీవిత విశేషాలనే ఆలకించండి.

అయిదువందలు మాసికవేతనం తెచ్చుకొనే వాళ్ళు కూడా రెండువేలుజీతం సంపాదించేవారి దర్జాకు తీసిపోకుండా వుండటానికే ప్రయత్నిస్తారు. తమనుగూర్చి భార్యా-బిడ్డలను గూర్చి తాజానాగరికత నములుపర్చే తీవ్రకృషితో వారి కున్న తీరిక సమయంలో అత్యధికభాగం చెల్లిపోతుంది. సినిమా, వాయుసేవనము, విందులు, డాన్సులు వారి కాల క్షేపానికి సాధనాలు, భార్య రూపవతీ, ఘోరవగలదీ అయితే భర్త పాపులారిటీ విస్తరించటమే గాక, వుద్యోగంలో గ్రేడు పెరగడంకూడ అతిసులువు. ఈ విధంగా ఉచ్ఛస్థితి కొచ్చిన వాళ్ళు నడకలో, దుస్తుల్లో, ఆచార - వ్యవహారాల్లో తాము అంతంతమాత్రపువాళ్ళం కామని ప్రదర్శించటానికి యెన్నో న్నో తిప్పలుపడుతుంటారు. పైవారి సముక్షంలో ఉదార మూర్తులుగ నటించే ఈరకం తమకంటె తక్కువవారిపట్ల కసాయీలుగ ప్రవర్తిస్తారు.

ఇక నాయకులు, పాలకులు అనబడేవారి సంగతి. ప్రజలు వీరి కనుసన్నల మెలగుతూ అడుగు జాడల ననుస రిస్తారు. కొందరిని భక్తితో కొలుస్తారు; మరికొందరికి భయం తో లొంగుతారు. ఈ నాయకుల్లో పాలకుల్లో చాలమంది రీతి - రివాజులు అతి విచిత్రాలు. అవన్నీ అవగాహన చేసు కుంటానికి యెంతో అనుభవం అవసరం.

ఈవిధంగా భిన్నభిన్నమతాలు, రకరకాల పార్టీలు, వేర్వేరు దేశాలు, వివిధ వర్గాలకు చెందిన స్త్రీ - పురుషుల కావాసమైన, భారత నందనోద్యానవన మనదగిన సిమ్లా నగరాన... హోటల్లో ఘటిల్లిన హత్యావార్త పత్రికలందు

సవివరంగా, వ్యాఖ్యానాలతో ప్రకటింపబడగానే అన్ని తావులా యెల్లరి కదే చర్చనీయాంశమైనది. పంజాబ్, రాజపుత్రస్థానం మున్నగు ప్రాంతాలనుంచి వచ్చి భోగ - విలాసాల్లో మునిగి తేలుతున్న రాజాధి-రాజులు, అమీరు - ఉమ్రావులు—స్త్రీ - సుర - సంగీతాలే ధర్మ-కర్మ-నియమాలుగా గలవారు-అందరి విమర్శనలకు హేతువైంది శమ్ షేర్‌సింగ్ ఖూనీ.

సిమ్లా సి. ఐ. డి. శాఖ, పోలీసు సిబ్బంది ఊపిరాడకుండ పరిశోధన సాగిస్తున్నారు. ఏదిక్కు చూచినా యెర్ర టోపీల దర్శనమే. షాపులు, దుకాణాలు తెరువబడినాయి; కాని, యజమానులు బేరసారాల్లేక బెదురుచూపుల్తో రోడ్ల మీద రక్షకభటుల చర్యలను గమనించుతున్నారు. వాళ్ళు ప్రతి అపరిచిత వ్యక్తిని శల్యపరీక్షతో చూస్తున్నారు. ప్రతి ఒకడు హంతకుని పట్టుకొనే గౌరవం తనకే దక్కాలనీ, ఈ దెబ్బతో ప్రమోషను అయ్యే అదృష్టం పట్టించుకోవాలనీ వుబలాటపడుతున్నాడు.

పగలంతా గడిచింది; కాని, పరిశోధనలకు ఫలితం లేకపోయింది. హంతకుని పత్తాగాని హర్ హైనెస్ జాడగాని చిక్కనే లేదు.

ప్రొద్దుపోకింది. ఆనాడు సిమ్లా వీధులు కలకల శూన్యమై కళావిహీనంగా వున్నై. సినిమాహాలులు సగం కూడ నిండలేదు. క్లబ్బులు, హోటళ్ళు మాత్రం మామూలు జనసమ్మర్దంతో నిండివున్నాయి. హత్యావివరాలు తెలుసుకోవాలనే ఆతురత ప్రతివ్యక్తి ముఖాన ద్యోతకమవుతోంది.

'నేనే అన్నమాటేమిటి. యీ ముగ్గుర్నీ యెరిగినవారు సిమ్లాలో వందలకొద్దీ వున్నా'రన్నాడు ఒక మహాశయు డొక హోటల్లో మధుపాత్రనెత్తి పుచ్చుకుంటూ. 'మొత్తం మీద ముగ్గురూ విచిత్రవ్యక్తులే! సాకీ తరచుగా నా బసకు వస్తూవుండేవాడు. హర్‌హైనెస్‌నూ. శమ్‌షేర్ సింగునూ కూడ యెరుగుదును; కాని, వారికిపరస్పరసంబంధమున్నవైనమే నాకు తెలియదు.' అక్కడున్న వారందర్నీ పైమాట లాక ర్షించాయి. హత్యకు నంబంధించిన వ్యక్తిత్రయంతో పరిచ యమున్నదని చెప్పుకొంటున్న పై మహాశయునిపైకి యెల్లరి దృష్టి మరలుటలో వింతలేదు.

నున్నగా గడ్డంగీయించి ఫ్రెంచికట్ మీసాలు కలిగిన ఒక యువకుడు 'ఇష్' బిగ్గరగా బైటకు మాట్లాడే విషయా లేనా యివి?' అన్నాడు.

'ఏఁ, తప్పా?' అని అడిగాడు మొదటి పెద్దమనిషి!

'మీరేగాదు, మీలాగ వారి నెరిగినవాళ్ళు చాలామం దున్నారు! యీ విషయిం తెలిసిందంటే ఏం జరుగుతుందో యెరుగుదురా?'

'ఏమవుతుందేమిటి?'

'గూఢచారు లెంత జాగ్రతగా కూపీతీస్తున్నారో తెలియదూ? ఫలానావాడికి యేదో తెలుసని వింటేచాలు, బులావ్ అంటారు.'

'ఆఁ, ఏంచేస్తారేమిటి? నా కిష్టమైతే లక్ష చెప్పు కుంటా నిక్కడ. పోలీసువాళ్ళకు చెప్పాలని నాకేం గాడు!

ఖూనీ జరిగితే కూపీ తియ్యటం జీతం పుచ్చుకుంటున్నందుకు వాళ్ళపనిగాక, నాకేం అవసరం!'

భేష్ అంటే శభాష్ అన్నారు వింటున్నవారంతా. యువకుడు ఎలాగయినా ఆ పెద్దమనిషిని మాటల్లో ఓడించి చిన్నపుచ్చాలని, తన ఆధిక్యతను ప్రదర్శింపపూనుకున్నాడు.

'ఇష్! వినండి ఈయనకంటె నాకు తక్కువ తెలిసి కాదు వూరుకున్నది. వెనకాముందూ పారచూడాలి మరి. చెప్పవలసొస్తే శమ్‌షేర్ సింగు నా మిత్రుడే. హర్ హైనెస్‌తో ...'అని ఆపి వింతగానవ్వాడు.

అక్కడున్నవారి దృష్టి యీతుదిమాట, నవ్వులతో యువకునిపైకి మళ్ళింది. అది మొదటి వ్యక్తి ఈర్ష్యకు కారణ మయింది. ఓర్వలేక అన్నాడు — 'తమకు హర్ హైనెస్ చుట్ట మనుకుంటాను! అవును కాదూ!'

యువకుడు రోషంతో మండిపడ్డాడు. 'లే'దని నొక్కి పలికి చురచుర చూచాడు. మొదటివ్యక్తి అంత టితో వదలిపెట్టలేదు. ఎగతాళి ప్రారంభించాడు. 'అలా అనుకున్నాను లెండి... అయితే, హత్య జరిగినప్పుడు తమ రక్కడే వున్నారు కదూ ?'

యువకుడు ఈ ప్రశ్నతో కంగారుపడ్డాడు. ఉడుకుబోతు తనంతో 'యిలా అడగటంలో మీ వుద్దేశమేమిటి!' అని రుసరుసలాడాడు.

మొదటివ్యక్తి 'వుండి వుంటారనే నావుద్దేశం' అన్నాడు నిశ్చలంగా.

'అనవసర జోక్యం కల్పించుకోవడం...' అని యువకు డేమో చెప్పబోయాడు; కాని యీలోగా ప్రక్కనున్న వారిలో స్థూలకాయుడు, కోరమీసాలున్నవా డొకడు లేచి 'దయచేసి మీరిద్దరు పోలీసు స్టేషనువరకు వచ్చి స్టేటుమెంటు లివ్వాలి' అని, మిగతా వారితో' మీరు మీ చిరునామాలు మాత్ర మివ్వండి. అవసరమైతే తర్వాత పిలిపిస్తాను.' అని నోటుబుక్కు పెన్సిలు తీసి, తెల్లచట్టం కళ్ళద్దాలగుండా వారి వంక చూచాడు. అక్కడున్న వారందరిముఖాలు వెలవెల పోయినై. ఊకదంపుడులో పాల్గొన్న యిద్దరి ముఖాల్లోను నెత్తురుచుక్క లేదు. ఎటుదిరిగీ గంభీరంగా వున్నది ఒక్క స్థూలకాయుడైన సీ. ఐ. డీయే.

# 17

అసలే పర్వతారోహణము, అందులో వంకరటింకర మార్గము. ఆ దారిలో చిందర వందరగా పడివున్న రాయీ-రప్పా. ఎదురుదెబ్బలు తగిలి పడుతూ, లేస్తూ, యిద్దరు ఆట వికులు సామానుమోస్తూ ముందు మార్గం చూపుతుండగా వారు వెనుక నడచిపోతున్నారు. వర్షంలేదు; కాని మేఘ మాలికలు వారి కంఠసీమల తాకుచు స్వాగతంచెప్తున్నాయి. కొండలెక్కుతున్న పరిశ్రమ కారణంగా వారి శరీరాల్లో వేడి పుట్టిఉండకపోతే యీపాటి కా మంచులో వారిరక్తం గడ్డకట్టుకొనివుండేది.

ఎదురుదెబ్బ తగిలి ముందు కొరిగిన హర్‌హైనెస్ నొప్పి కోర్వలేక కెవ్వుమని కేకపెట్టింది. సాకీ వెనక్కితిరిగి 'ఏమి' టన్నాడు.

'అబ్బ! గోరెగిరిపోయింది, దెబ్బతో... ఈ కష్టాల కంతెప్పుడు?'

సాకీ కళ్ళల్లో నీరు కమ్మింది. 'దుఃఖించకండి. కష్టాలు కలకాలం వుండవు! అల్లాకి తప్పక దయకలుగుతుంది హుజూర్.' అన్నాడు కాతరకంఠంతో. 'అడుగు పడటంలేదు సాకీ. ఇక నేను నడవలేదు' అని హర్‌హైనెస్ ఒకరాతి బండమీద చతికిలబడింది. కూలీల నాపుచేయమని సాకికి చేసన్న చేసినది. కూలీలు కూనరాగం తీస్తూ సాగి పోతున్నారు. వారం రోజులనుండి వీరి సామాను మోసు కొస్తున్నారు. వీరివెంటపోవటం, వీరు పెట్టింది తినటం వాళ్ళపని. సాకీ కేకతో పెట్టె - బేడా కిందపెట్టి వాళ్ళు చతికిలబడ్డారు.

'సరిగా వారం గడిచిపోయింది. ఇంకెంతదూరం, ఎన్నాళ్ళు నడవాలో?' అన్నది హర్‌హైనెస్ మళ్ళీ రాతి చల్లదనానికి ఆగలేక లేస్తూ.

'హుజూర్, నా మనవి విని యిప్పుడైనా తిరిగి వెళ్ళండి. రెండురోజులు నడచివెళ్తే డోలీ దొరుకుతుంది. అక్కడినుంచి సునాయాసంగానే సిమ్లా చేరుకోవచ్చును.'

ఆమె అతనివంక కొరకొర చూచిందేగాని సమాధానం చెప్పలేదు.

సాకీ బిక్కమొగంతో 'తమకుకోపం వచ్చిందా? నాగురించి తమరు శ్రమపడటం, యిక్కట్లులపాలవటం యిష్టంలేక అలా అన్నాను యువర్ హైనెస్.' అన్నాడు బ్రతిమాలుకున్నట్లు.

'వెళ్లు వెళ్ళని పదేపదే చెపుతా వెందుకు సాకీ? ఎట్టి సంకటస్థితిలోనైనాసరే నిన్నంటిపెట్టుకొని వుంటాను. చచ్చినా, బ్రతికినా నీతోనే.'

అతనికళ్లు ఆనందంతో మెరిశాయి. ప్రేమవిహ్వాలుడై ఆమెచెయ్యి పట్టుకుని 'కాని, మైడియర్...'అన్నాడు. ఆమె మధ్యలోనే నవ్వి 'సాకీ, కొంచెం సారా యిస్తావ్?'అని అడిగింది.

సాకీ 'జోహుకుం సర్కార్' అంటూ చరచర కూలీల వద్దకుపోయి పెట్టిలోనుండి సీసా, గ్లాసూ తెచ్చాడు.

పర్వతారణ్యప్రాంతంలో విదేశవిస్కీ, బ్రాందీ లెక్కడివి? కల్లు, సారాలే అక్కడి నిషాద్రవ్యాలు. అవైనా పుష్కలంగా దొరుకుతాయన్న నమ్మకంలేదు. ఇప్పుడు వీళ్లు గత్యంతరంలేక వాటికే అలవాటుపడ్డారు.

అతడు గ్లాసులో పోస్తుంటే ఆమె పేలవంగా నవ్వి "కొంచెం—ఆఁ, చాలు. ఇదికూడా కరవైతే మరీ యిబ్బంది." అంది.

సాకీ గ్లాసులో సగం సారాయిపోసి సగం ప్రక్కనే వున్న వాగు నీళ్ళతో నింపాడు. హర్ హైనెస్ పూర్వంలాగ గటగట తాగలేదు. ఒక గుక్కెడుపీల్చి గ్లాసు కిందపెట్టింది. చౌకపారు సిగరెట్టొకటి ముట్టించింది. చేత్తో పట్టుకుంటానికి

పీల్లేనంత చివరివరకు కాల్చుతూ సిగరెట్ మసిని గ్లాసు లోనే రాల్చింది.

గ్లాసు కుదిపి కుదిపి మళ్ళీ తాగసాగింది. తాగుతూ తాగుతూ వికటంగా నవ్వి 'సాకీ' నీ కా రోజులు జ్ఞాపకం వున్నవీ?' అంది.

అతడు తలూపి 'అవును హుజూర్' అన్నాడు.

'అప్పుడు తాగిన షాంపైన్‌లో యీ మజా యెక్కడుంది? దానికీ దీనికీ పోలికేమిటి? ఇక్కడ ఈ నిర్మలవాయువుతో కలిగే హుషారు, యీ ప్రకృతిసౌందర్యంలో వున్న ఆకర్షణా అక్కడెక్కడివి?' తల పై కెత్తి చూచి 'వింటున్నావా సాకీ?' 'నిజం నిజం.' అన్నాడు సాకీ.

ఆమె మరొక గుటకవేసి 'ఆ రోజులు! ఆ స్వర్గ ఘడియలు నీకూ - నాకూ కూడా మరపురావు. వాటిలో రస మున్నది; గాని రుచిలేదు. దాస్యశృంఖలాల్లో నలిగిపోయిన ఆ రోజులు - అబ్బ! ఆ కృత్రిమ నటన, కపట చాతుర్యం, మోసజాలములలో నేనెంత గిలగిల తన్నుకున్నాను! అదంతా నీకూ తెలుసు. మరిప్పుడో? ఈ భయంకర కీకారణ్యంలో, ఖూనీ చేసి, యిల్లు వాకిలి వదలి పారిపోయి వచ్చి, మిత్రులు, ఆప్తులనేవాళ్ళు లేక విప్పసారాతో తృప్తిపడుతూ...... మన కెట్టిగతి పట్టిందోయ్ సాకీ!' గ్లాసు ఖాళీచేసి మళ్ళీ అన్నది—'నా యీ దుస్థితికి కారకులెవరో తెలుసా?'

సాకీ వినయంగా 'తెలియదు హుజూర్' అన్నాడు.

'నా భర్త! లక్షలమంది ప్రజలకు, వేలాది, దాస - దాసీ జనానికి అధినేత - దేశంలోని గొప్పవారిలో ఒకరు -

ప్రపంచంలో తాజాగా తయారైన విలువగల ఏ వస్తువునైనా తెప్పించగల్గిన – రాణీవాసంలో లెక్కకు మిక్కిలిగా రాణులు, ఉంపుడుకత్తెలు చుట్టుకొనియుండ కడవల కొలది మధుపానం చేస్తుండే హిజ్ హైనెస్! వారి కెందరు మిత్రులు! ఎందరాయనచే పోషింపబడుతున్నారు! వారి ఉచ్ఛిష్టాన్నే మహాప్రసాదంగా తలచేవారు – వారి పాదరక్షలను శిరమున దాల్చుటమే మహా అదృష్టముగ ఎంచేవారు ఎందరు! వారి దర్శనాన్నే స్వర్గసౌఖ్యంగా భావించేవాళ్ళు ఎందరులేరు! ఒకరు వారిని 'మహర్షి' అంటే మరొకరు 'రాజర్షి' అంటున్నారు. వారే... వారే నా బాధ ఇక్కట్టులకు కారకులు. వారి కటాక్షంవల్లనే నా జీవితానికీ అధోగతి సంప్రాప్తించింది... నే నిక్కడ క్రుంగి, కృశించి నశించిపోతాను; కాని, మళ్ళీ వారిగడపకూడా తొక్కను.'

సాకీ కదలకుండా మెదలకుండా, ఆమెనంతే చూస్తున్నాడు.

హర్ హైనెస్ వెకిలిగా నవ్వి సాగించింది – 'ప్రజాసామాన్యం – ముఖ్యంగా అలగాజనం మన సౌందర్యము, భవన్లు, ధనరాసులు, ఆభరణాలు, మోటార్లు, భోగాలు, విలాసాలను ఈర్ష్యతో చూస్తారు; గునుస్తారు; తిడతారు కూడాను. భగవంతుడు పక్షపాతియై సౌఖ్యమంతా మన హస్తగతం చేశాడనే, పాపం! వారి వుద్దేశం. ఇవన్నీ తమకు ప్రసాదించమని వెయ్యిదేవుళ్ళకు మొక్కుకుంటారు. అసలీ ఐశ్వర్యంలో వున్న సౌఖ్యమేమిటో నన్నడిగితే చెప్పుదును! ఆ డాబు–దర్పాల్లో, సౌందర్యానందాల్లో, అంతులేని సంప

ర్భాగ్యాల్లో యెంత నటన, మోసము, చీకు—చింత, అధః పతనము అంతర్గర్భితమై వున్నాయో వారికేం తెలుసు? నా మట్టుకు నేను యెందరివలలో చిక్కుకున్నాను! ఎందరు నా ధన-మానముల నపహరించారు! ఆ పనులు పాపకార్యాలని తలచే మానవుడేడీ? ఒక్కడూ కన్పించడే! స్వచ్ఛమయిన పవిత్రప్రేమ నాయందు చూపినవా డొక్కడూ లేడు ... మన స్నేహము, బంధుత్వము, మమత, గౌరవము, ప్రవర్తన - అన్నిటిలోను రాజకీయ వాసనే. పెళ్ళి—పేరంటానికి స్వేచ్ఛ లేదు. ఒకర్ని కలుసుకోవాలంటే కట్టడి; మాట్లాడాలంటే నిర్బంధం. కొంచె మాలోచించి చూస్తే యింతకంటే నీరస జీవిత మింకేముంది?'

'శాంతించండి హుజూర్, ఉద్రిక్తులుకాబోకండి.'

'కాని, నాపట్ల నిజమైన విశ్వాసం చూపినవాడివి నీవే సాక్షి! నామీద నీకు చాలా ప్రేమవుంది. అందువల్లనే ప్రాణంతో చెరలాడి, తెగించి ఆ నష్టజాతకుని నేలకూల్చావు. అతన్ని దురదృష్టవంతుడనే అంటాను. ఎందుకని? నా యీ సౌందర్యంచూచి సమ్మోహితుడు కావటమే దురదృష్టం. అతని కా అర్హత లేదు. తప్పు చేశాడు; అనుభవించాడు. అందులో నా తప్పుకూడా స్వల్పంకాదు. ఆదిలోనే అతనికి స్వస్తిచెప్పివుండవలసింది. అలా చెప్పకపోవటానికి కారణం నా మనో దౌర్బల్యమే. అక్కర గడుపుకోవాలనే కక్కుర్తికి లోబడ్డాను. నా కంతకంటె దారిలేకపోయింది.'

'గత్యంతరంలేనప్పుడు అంతే యువర్ హైనెస్.'

'కాని, నీ ధైర్యసాహసాలు, విశ్వాసం, ఓర్పులను నే నభినందించకుండా వుండలేను సాకీ. ప్రాణోపద్రవకరమైన పరిస్థితిలోకూడా హోటలునుంచి యింత సామాను తరలించుకొని రావటం, ఆ చెక్కుకు బదులు...'

'అందులో నా గొప్పతనం ఏమీలేదు హుజూర్! అది నా కర్తవ్యం.'

'నువ్వు బలే చాకచక్యంగా పనిచేసుకొచ్చావు. పది వేలకు బదులు అయిదువేలే అయినా అప్పుడే మార్చకపోతే తర్వాత మన కది నాలుకగీచుకుంటానికికూడా పనికిరాకపోను. ఈ కష్టదశలో అయిదువేలు మాత్రం సామాన్యమా?'

సాకీ చుట్టూ పారజూచి,'మన మిక త్వరగా బయలు దేరకపోతే, ఈకీకారణ్యంలోనే చీకటిపడిపోతుంది'అన్నాడు.

ఇద్దరూ లేచారు.

## 18

విలాసవాటికలో మహా కోలాహలంగా వుంది. హిజ్ హైనెస్ ఆంతరంగికబృందంలోవా రొక్క రొక్కరే అంతా చేరుకున్నారు. అప్పుడే నిశాదేవి పగటి వెండి తెరకు నల్లముసుగు వేస్తోంది. శృంగారమందిరముచుట్టు నున్న కృత్రిమ నీటిబుగ్గలు నీరు చిలకరిస్తున్నవి. రకరకాల పూల మొక్కలు చక్కని శోభను ప్రదర్శిస్తూ వింతవాసనల విర జిమ్ముతున్నవి శృంగారమందిరము మహారాజావారి విలాస

లీలల నిమిత్తం నిర్మింపబడిన ప్రత్యేక పాలరాతి కట్టడము. శృంగారలీలలకు నాగరికతా ప్రపంచంలో లభ్యమయ్యే సర్వ సామగ్రి అందులో చేర్చబడినది.

నేడు ప్రత్యేకంగా ఆ భవనముందు వేరే మంటప మొకటి తయారుచేయబడింది. సర్వాలంకార సుశోభితమైన ఆ మంటపంలో తివాసీపైన అమర్చబడ్డ పట్టుపరుపులమీద బాలీసుకు జేరబడి ఆసీనులైవున్నారు హిజ్ హైనెస్. దిండ్లకానుకొని కూర్చున్నారు మిగతావారు. అందరిముందు మధుపాత్ర లున్నవి. ఎదుట అప్సరసలను ధిక్కరించు విలాసవతులు ఆకర్షణీయములగు వస్త్రాలంకారములు దాల్చి, హావభావముల ప్రకటిస్తున్నారు వారిలో రూపవతులయిన యువతులిద్దరు హిజ్ హైనెస్ కిరుప్రక్కలా కూర్చుండి మధుపాత్ర లందిస్తున్నారు. మిగిలిన పడుచులు ఒక్కొక్క రొక్కొక్క పురుషుని జేరి సరససల్లాపములాడసాగారు.

ప్రొద్దుపోతోంది. మింట చుక్కలు మిలమిలలాడు చున్నవి. ప్రపంచానికది నిశిరాత్రి. కాని, అక్కడ రంగు రంగుల విద్యుద్దీపాలు పట్టపగలునుమించే కాంతులను ప్రసారించుతున్నవి. ఆ శృంగారమంటపంలోకిగాని, విలాసవాటికలోగాని పరులు ప్రవేశింపవలనుపడదు. అక్కడ పనికిఅవసరమైన కొద్దిమంది నౌకర్లు మాత్రమే అటు ఇటూ మసలుతున్నారు.

శృంగార సౌధమునుండి రేడియోపాట వినిపిస్తోంది. శ్రావ్యమైన స్వరం. అందరూ ఆప్యాయంగా వింటున్నారు. కాని హిజ్ హైనెస్ హుకుం ఇవ్వటంవల్ల ఆ పాట బందైంది.

'ఏమి టీ తెక తెక' అన్నారు శ్రీ వారు ప్రక్కనున్న ఒక సుందరితో 'నీకు ఉక్కగా లేదూ?'

'భరించరాని వేడి ప్రభూ!'

కొన్ని లైట్లు ఆర్పివేయబడినై.

'ఊఁ, రానివ్వండి.' సురాపానం జోరు మందగించటం గమనించి అన్నారు. ఆ మాటతో అందరూ గబగబ గ్లాసులు ఖాళీ చేశారు. నౌకరులు నిండుబుడ్లు తెచ్చి మూత లూడదీశారు. మళ్ళీ పరససాగింది.

హిజ్ హైనెస్ నిషా తలకెక్కి ఫూగిసలాడుతూ యెడమవైపున వున్న చిన్నదానిమెడ చేతితో చుట్టి గట్టిగ అదుముకున్నారు. యువతి కంఠం బిగుసుకొని వుక్కిరిబిక్కిరై కెవ్వున కేకపెట్టింది రెండు చేతులతోను హిజ్ హైనెస్‌ను విదలించి తోసిపారేసింది. శ్రీవారి కప్పుడు స్పృహ లేదు. ఆ తోపుతో వారు నరికిన కదళీవృక్షంవలె పక్కకి ఒరిగారు. పక్కనున్న రెండో సుందరి మోకాలు వారిమెడకు ఫొడుచుకుంది; కాని వారి కదేమీ తెలియదు. తాము కోపగించాల్సినదేదో జరిగిందని మాత్రం వారికి తోచింది.

'ఓసీ టక్కరిముండ! నీకు ఒళ్ళు నీరుపట్టిందా?' అన్నారు.

వెంటనే అక్కడున్నవారంతా లేచి నిలబడ్డారు. ఏం మునుగుతుందో నని వాళ్ళ గుండెలు దడదడలాడుతున్నవి.

వారందర్నీచూచి శ్రీవారి నిషా కొంచెం తెరపి యిచ్చింది; కాని రౌద్రం ద్విగుణీకృతమైంది. 'ఈ ముండబొట్లో హూనం చెయ్యండి.' ఆ సుకుమారి మోటుతనాన్ని సహిం

చలేక బాధతో తోసివేసిందే కాని మరుక్షణంలోనే తన తప్పిదాన్ని గ్రహించింది. భయంతో ముడుచుకుపోయింది. గుండెదడ ఆగటంలేదు. పామునోట చిక్కిన కప్పలాగుంది ఆమెస్థితి. హిజ్ హైనెస్ ఆమెజుట్టు లంకించుకొని గుంజి, విదలించి వెనక్కి తోశారు. ఇక నంతకంటె యేమీ చెయ్యలేకపోయారు. కాళ్ళు తడబడుతున్నాయి. చేతులు పట్టు తప్పుతున్నై. కళ్లు తిరుగుతున్నవి. తూలి, పరుపుమీద కూల బడ్డారు.

'సిగ్గు... లేని... శి... ఖం... డీ! ఎ... వ... రను... కున్నా... వ్ వ్ వ్ వ్?' అరుణ నయనగోళాలనుండి అగ్ని వర్షం కురిపిస్తూ అన్నారు.

ఆమె భయంతో వణకిపోతోంది. బోర్లాపడివున్న ఆ చిన్నది దెబ్బతగిలినా పెదవి విప్పలేకపోయింది. తల పైకెత్తటానికి సాహసించలేకపోయింది. ఆపళంగా భూమిలోకి సీతమ్మవారిలాగ కృంగిపోతే బావుండుననుకుంటోంది. ఇది రెండో తప్పు. శ్రీవారిక్రోధం మరింత హెచ్చింది.

'మాధవసింగ్!' అని పిల్చారు. 'జీ సర్కార్!' అంటూ రాజావారి పాతకోటొకటి తగిలించుకొన్న బుర్ర మీసాల జవాను ముందు కొచ్చి సాష్టాంగ దండప్రణామ మాచరించి చేతులుకట్టుకొని నిలబడ్డాడు.

'ఈ తొత్తును చెరచి, చావమోది పంపండి.' మాధవసింగూ వానిక్రింది నౌకర్లూ ఆ యువతిని చేతులమీద లేవదీసుకొని వెళ్ళారు. సర్దారులు వగైరా కనుబొమ్మలు యెగరేసి, క్రోధమూర్తులై, పళ్ళు పటపట నూరుతూ ఆ

దార్భాగినివంక చూస్తున్నారు. తక్కిన వారాంగనలు తమ కేమి మూడుతుందో నన్న భీతితో ఆరాటపడుతున్నారు.

మాధవసింగుముతా ఆయువతిని తీసుకొని గేటులోపల కాపౌండుగోడ నానియున్న సేవకుల పెద్దను చేరనైనా చేరకముందే బయటనుంచి భయంకర కోలాహలంవిన్పడింది. 'కొట్టండి!' 'చంపండి!' 'తలుపులు పగులగొట్టండి!' 'ధనాగారం దోచుకోండి!' 'నిరంకుశ ప్రభుత్వం అంతరించాలి!' మొదలైన నినాదాలు వందలకొద్దీ కంఠములనుండి ప్రహారీగోడలను దాటి వస్తున్నాయి.

కాపలా సైనికుడు తుపాకిచూపి వచ్చే జనాన్ని ఆపు చేయ ప్రయత్నించాడు; కాని, ఆ మహాప్రవాహం ముందు వాడు గడ్డిపోచచందమయ్యాడు. ఒక్క నిముషంలో వాడిని పడద్రొక్కుకొని ప్రజలు తండోపతండాలుగా తోటలోపలికి వచ్చేశారు. మంటపం చూచి విప్లవ సమూహం అటు వైపు కదిలింది. మితిమీరిన కష్టాలు నోరులేని ప్రజలను కూడా తిరుగుబాటుకు తయారుచేశాయి.

## 19

చూస్తూ చూస్తూవుండగానే ఆ విశాల విలాసవాటిక నేల యీనినట్టు వచ్చిపడ్డ జనసమూహంతో నిండిపోయింది. మంటపం దాపులోకి వచ్చేశారు. మంటపంలోవున్న రాజాగారిని, వారి అనుచరులను చూచారు. ముందున్న వారు కేకలువెయ్యటం మానారు; కాని వెనకనుంచి

'మాకు కడుపునిండ అన్నం కావాలి.'

'అధికార్ల దౌర్జన్యం అంతరించాలి.'

'లంచగొండితనం నశించాలి.'

'ప్రభుత్వం ప్రజాయత్తం గావాలి' అనే కేకలు మిన్నుముట్టుతూ నేవున్నాయి. ఎవరి నోటికి వచ్చినట్టు వారు అరుస్తున్నారు.

హిజ్ హైనెస్, వారి సామంతులు, సర్దారులు (విలాస క్రీడల్లో పాల్గొంటున్నవారు) యీ హంగామా చూచి విస్తుపోయారు. శిలావిగ్రహాల్లాగ చూస్తూ వుండిపోయారు. కొన్ని నిమిషాల క్రితంవరకు సాగుతున్న విలాసచేష్టలు ఎక్కడమ్మున బంద్ైనాయి. వారికి వినోదవస్తువులుగ వుపకరించు చుండిన యువతీబృందము గజగజలాడుతూ ప్రక్క ప్రక్కను నక్కుతున్నారు. మహారాజావారి నిషా ఎగిరిపోయింది. ధైర్యం చిక్కబట్టి ముందు కొచ్చి మంటపంముందు ఆగి ఉన్న ప్రజాసమూహాన్నుద్దేశించి మీరంతా 'అడ్డగోలుగా యిక్కడి కెందు కొచ్చారు?' అని అతి ప్రయత్నంమీద అడిగారు. గుంపులో ఒకక్షణం నిశ్శబ్దం. తర్వాత ఒకగొంతు వినపడింది—'న్యాయంకోసం!'

ఇక మాట్లాడకపోతే తనహోదాకు భిన్నమని ప్రధాన మంత్రి ముందుకు రెండడుగులువేశాడు. శ్రీవారికి వంగి నమస్కరించి, గుంపువైపు తిరిగి నోరు విప్పాడు—'మీరు న్యాయంకోసం వస్తే మంచిదే. ఘనతవహించిన మహారాజా వారితో మీ కష్ట - సుఖాలు చెప్పుకోవచ్చును; కాని, యిదేనా సమయమూ, చోటూ?'

సమూహంలోనుంచి ఒక్కసారిగ అనేక కంఠాలు లేచాయి. 'మేము మాకష్టాల్ని ఇప్పుడే చెప్పుకుంటాం' 'మా గోడు వినే దిక్కులేదు!' 'ఇక మేము సహించం' ఇంకేమేమొ వినిపించాయి. మంత్రిసత్తముడు తియ్యని మాటల్తో త్రిప్పి పంపాలనుకున్నాడు.



'మీకు కలిగిన కష్టాలకు దేవాంశసంభూతులు, దయాస్వరూపులు అయిన మన మహారాజాగారు స్వయంగా చాల విచారపడుతున్నారు. శ్రీవారు మీ ఇక్కట్టులను నిర్మూలింప నూతనప్రణాలికను తయారుచేయిస్తున్నారు. ఇక ప్రభుత్వం మీ కన్నివిధాల అండగా వుంటుంది; కాని చర్చలకిది సమయంకాదు. మీరింతమంది శ్రమపడి రావలసిన అగత్యంకూడా లేదు. మీకిష్టమైన నలుగురు ప్రతినిధుల్ని పంపండి...'

ఈ సానునయవాక్యాలు ఆ మంత్రి అత్యాచారాలతోనే మంటెక్కియున్న వారిని సంతృప్తిపరచలేకపోయాయి. వారతనిమాటలను తుదివరకు వినటానిక్కూడ వేచియుండజాలకపోయారు. మళ్ళీ కేకలు రేగినాయి 'మాకీ కల్లబొల్లి మాటలతో పని లేదు.'

'లంచగొండి వుద్యోగుల్ని తొలగించాలి.'

'మామొర వింటానికి కాలహరణం పనికిరాదు.'

'మాపంటలు పాడయ్యాయి.'

'మాభుక్తికి దారిచూపండి.'

'మా స్త్రీల మానరక్షణకు పూచీపడాలి.'

'మాప్రాణాలైనా బలిచేస్తాం; కాని తిరిగిపోము.'

క్రమంగా వుద్రేకం పెరుగుతోంది. హిజ్ హైనెస్ చేసన్నతో మంత్రి వెనక్కి తగ్గాడు, శ్రీవారేదో చెప్ప బోయారు. ఇంతలో 'కొట్టండి' 'చంపండి' అన్న కేకలతో గంద్రగోళం సాగింది.

మాధవసింగు లాక్కొనిపోతున్న యువతిని గుంపులో వెనకవున్నవారుచూచారు. ఆమెను విడిపించి నోట్లో కుక్క బడివున్న గుడ్డ లాగివేశారు. గుచ్చిగుచ్చి అడగ్గా అడగ్గా ఆమె జరిగిన వైనమంతా చెప్పి యేడ్చింది. ఒక్కక్షణంలో ఈ సంగతి యావన్మందికీ తెలిసిపోయింది. ఇది హోమగుం డంలో నెయ్యిపోసినట్లయింది. వారికోపం భీషణరూపం దాల్చింది. యువకులు పట్టపగ్గాలులేక పరవళ్లుతొక్కు తున్నారు. ఆ ఆవేశంలో యిద్దరు యువకు లా హతభాగినిని ముందుకు తీసుకొనివచ్చారు.

అసలేక్లిష్టస్థితిలోవున్న హిజ్ హైనెస్ తమబృందంతో సహా ఆ యువతినిగాంచి తెల్లమొహంవేశారు.

'ఈ అత్యాచారా లిక సహించం.' 'ఇప్పుడే అమీా తుమీా తేలాలి.'

ఆదిగాగల గావుకేకలతో ఆవేశము అతిశయిస్తోంది. ప్రజలు వారిపైన విరుచుకుపడబోతున్నారు. వెక్కి వెక్కి యేడ్చే ఆయువతి రోదనము రణదుందుభి అయింది. రాజా గారు, వారివర్గము రానున్న విపత్తునూహించి తప్పుకుంటానికి దారిలేక గుండె లరచేతపట్టుకొని నిర్విణ్ణులై చూస్తున్నారు.

అంతలో గేటువద్ద 'మహారాజాధిరాజులుం గారికి జై' అన్న జయధ్వానము మారోగింది. తుపాకులతో ఒక

సైనికదళం లెఫ్ట్ - రైటులతో కదం తొక్కుతూవచ్చేసింది. వారిదే ఆ జయకారము.

ఇంకేముంది! దృశ్యం తల్లకిందులైంది. ముకుళించుకొనిఉన్న శ్రీవారిముఖం ప్రభాతపద్మంలా వికసించింది. ప్రధానమంత్రి చిరునవ్వుతో రొమ్ము విరిచాడు. హిజ్ హైనెస్ తక్షణం హుకుంజారీచేశారు.

'ఈ బద్మాష్‌లను చుట్టుముట్టండి.'

సైనికదళ ప్రవేశంతో, పాలకుల హుకుంతో సమూహంలో కలకలం పుట్టింది. కొందరు పిక్కబలం చూపటానికి దారికోసం తంటాలుపడుతున్నారు. మరికొందరు ఏమైనాసరే కదలకూడ దనుకున్నారు.

సైనికులు మళ్ళీ జయ జయధ్వానం చేసి ప్రజలనన్నివైపులనుండి చుట్టేశారు. మంటపంలోనివారి కప్పటికి గుండెలు కుదుటపడినాయి. సచివోత్తముడు మీసాలు మెలివేస్తూ ముందుకొచ్చి 'ఉత్తరువు యిచ్చేవరకు వీళ్ళ నిక్కడే నిలవేసి వుంచండి.' అన్నాడు.

అప్పుడు సర్దార్లు, అంగరక్షకులు హిజ్ హైనెస్ దారి తీస్తూవుంటే వారికి ముందు వెనుకల నడుస్తూ శృంగార సౌధమువంక బయల్దేరారు.

సమూహంలో ప్రాణాలకు తెగించి వచ్చినవారు మరి సహించలేకపోయారు. ఇంతమంది మొరపెట్టుకోవటానికి వస్తే ఏమీ చెప్పకుండా తమను సైనికులకు అప్పజెప్పి వెళ్ళిపోతుంటే వారి వుద్రేకము దెబ్బతిన్న పులివలె విజృంభిం

చింది. రాజుగారిని నిలవేసి తాడోపేడో తేల్చుకోదలచారు. అనుచరులకు ఆవేశం కలిగించ ప్రయత్నించారు.

'రాజును పోనివ్వకండి. ప్రాణంమీద ఆశవదలి ముందుకు దూకండి.'

సమూహంలో మళ్ళీ కోలాహలం. కొందరు సాహసించి ప్రభువు నాప పరుగెత్తారు. అడ్డగించినవారిని తోసుకెళ్ళారు. కొందరింకా గుంజులాడుతున్నారు. ముందు విసురులో తప్పించుకొని వెళ్ళినవారు హిజ్ హైనెస్‌ను పట్టుకొనబోయారు. కాని, సరిగా అదేక్షణంలో 'షూట్ షూట్' అన్నమాటలు వినిపించాయి. ఇలాంటి ఆపదలో ఆదుకొనటానికే ఎంత కాలంనుంచో పోషింపబడుతూ వచ్చిన సైనికులు ఢాం, ఢా మ్మంటూ తుపాకులు పేల్చుతూ ఆ అమాయిక - నిరాయుధ ప్రజాసమూహాన్ని మట్టుపెట్ట సాగారు. ఢాం ఢాం ధ్వనులు దిక్కులను పిక్కటిలజేస్తుంటే పిరికి పందలు పిక్కబలంచూపటానికి తొక్కిసలాడారు. ధీరులు గుండెలుచూపి కూలిపోయారు.

గాయపడినవారి చీత్కారాలు, ఆహతుల ఆక్రందనాలు హాహాకారాలు చెలరేగగా, విలాసవాటిక కేళీవిలాస క్రీడ మహాదారుణ భయానక భీభత్సహింసాకాండగా మారి హృదయవిదారక దృశ్యమయింది.

## 20

సిమ్లాలోని సెక్రటేరియట్ ఆఫీసు గదిలో ఒకబల్ల కిరువైపుల యిద్దరాంగ్లేయులు కూర్చుండి మెల్లగ మాట్లాడు కుంటున్నారు. వారిలో ఒకడు పొట్టిగా, లావుగా వున్నాడు. ముఖంమీద లోతైన ముడతలున్నై. రెండోవ్యక్తి సన్నగా వున్నాడు. పీలముఖం. బయట ఎండకాస్తోంది; కాని కిటికీ లన్నీ మూసివుండటంవల్ల లోపల వెలుతురులేదు. పగటి దివిటీ కొంతవరకా లోటును తీరుస్తోంది. బ్రిటిష్ సామ్రాజ్య రథచక్రంమల్లేనే విద్యుత్ పంఖా గిరగిరా తిరుగుతోంది. ఆంగ్లజాతి అదృష్టవంతమైనది. రాజ్యాంగనిర్మాణంలో వారిది అందెవేసినచేయి. గత మూడు శతాబ్దాలనుంచి కొన్ని యితరజాతుల బలహీనత కారణంగా లాభాన్ని చూరగొను టలో ఇంగ్లీషువారు మరేజాతిని పైకెక్కనీయలేదు. ఈ వ్యవధిలో వారి డిప్లమసీ మెరుగుదేలి, సూక్ష్మమై ఎంత ప్రయత్నించినా అన్యులకు అవగాహన కానిదీ, అందనిదీ, అయింది.

శ్వేతమాతలు తమ బిడ్డలకు ఉగ్గుపాలతో రాజకీయా లను రంగరించిపోసి పెంచుతారు. వారి ప్రతి రక్తనాళం లోను లౌక్యము జీర్ణించివుంటుంది. నక్కజిత్తులు వారి సొంతసొమ్ము. మానవులంతా వానర సంతానమని తేల్చిన పరిశోధనలు ముందు యుగంలో ముందుకుసాగి ఆంగ్లజాతిని నక్కవారసుగా బయటపెట్టుతారేమో! ప్రతి రంగంలోను

వేలకొద్ది నిపుణులను తయారుచెయ్యటం ఆంగ్లరాజనీతిలో ప్రధాన సిద్ధాంతం. యుద్ధం చెయ్యటానికి, సంధి కుదర్చటానికి, పాలించటానికి, బాగుచెయ్యటానికీ, చెడగొట్టటానికి- అదేమిటి దేమిటి - అన్నిటికీ వేర్వేరు శాఖల్లో ఆరితేరిన అనుభవజ్ఞులను సృష్టించి దేశంమీద, ఇండియావంటి ఇతర భూభాగాలమీద వదుల్తారు. ఆంగ్లరాజనీతిపరిజ్ఞానం తగినంత లేనిదే వారు ఏది ఎక్కడ, ఎందుకు ప్రారంభించారో, ఎప్పుడు, ఎట్లా అంతమవుతుందో గ్రహించటం అసాధ్యం. వారి యీ విచిత్ర రాజనీతే ఎన్నిలోట్లువున్నా మహావిషమ పరిస్థితుల్లోకూడా వారిని కాపాడింది. పొట్టిగా, లావుగా వున్న పై తెల్లవాని పేరుగాని, ఫొటోగాని ఎన్నడూ ఏ పత్రికలోను యెక్కలేదు. ఏ డిన్నరు, టీపార్టీలందు గాని, సభా - సమావేశాల్లోగాని అతని ముఖం కన్పించి వుండలేదు. అంతమాత్రాన అతడు, తన గొప్పతనానికి లోపమని భావించడు. రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్య భవనవాహకస్థంభాల్లో అతగా డొకడు. భారతదేశంలోని బ్రిటిష్ ప్రతినిధుల్లో ఎంతటివాడినైనా తన కలంపోటుతో కదంతొక్కించగలడు.

రెండోవ్యక్తి అతనికి కార్యదర్శి. ఇతడు తనపై అధికారి కనుసన్నల మెలగుచు అవసరమైతే తలతీసి అర్పించుకోటానికైనా సంసిద్ధంగా వుంటాడు. ఇక వీరి రోజువారీ భత్యం సంగతి; అది వేలసంఖ్యమీద వుంటుంది. ఇచ్చేవాడి అబ్బసొమ్ము కానప్పుడు యెంతైతేనేమి! అయితే, యిందుకు ఋజువుమాత్రం యే ప్రభుత్వ రిజిష్టరులోను లభించదు

సుమండి! అదొక బ్రహ్మరహస్యం ! 'నా అభిప్రాయమూ అదే. ఇందులో రాజకీయవాసన యేమాత్రంలేదు' అన్నాడు. ఆఫీసరు.

'అయినా యీ సంఘటనను రాజకీయంగా బాగా ఉపయోగించుకొనవచ్చని పొలిటికల్ డిపార్టుమెంటుకు సలహా నీయవచ్చుగా!'

'ఓయి వెర్రివాడా! ఆ పని యింకా చెయ్యకుండా వున్నాననా? అది ముందే జరిగింది. ఈ విషయంలో అప్పుడే దీర్ఘాలోచనలు సాగుతున్నాయి. అయితే ఈ విషయంలో మనం ఆద్యంతములు తెలిసికోవటం అవసరమే కాక అని వార్యంకూడాను. ఇంతవరకు సేకరించబడిన ప్రమాణాలు నా ఊహకే దోహదమిస్తున్నాయి. నా ఉద్దేశాన్ని వారికి తెలియపర్చాను; కాని, దాన్ని నిర్ణయించటానికి యింకా దృఢమైన ప్రమాణాలు చూపమన్నారు. ఈ కోరిక సబబయిందే. ఇందుకు మనకున్న గడువు నాలుగు రోజులు మాత్రమే !'

'నాలుగుదినాలేనా?'

'అంతే, నాల్గురోజులు చాలవూ యీ చిక్కును విడదియ్యటానికి?'

'అంత కష్టం కాదులెండి.'

ఒక చేతివ్రేళ్ళను మరో చేతివ్రేళ్ళసందుల్లోకి పోనిచ్చి ముందున్న బల్లమీద మోచేతులపై నానుకొని 'వాషింగ్టన్! ఇందులో నీ కివ్వబడేది మూడురోజులే సుమా' అన్నాడు

ఆఫీసరు. కార్యదర్శి ఆ వ్యవధిని లోలోపల గుణించుకొంటూ 'మూ...డు రో...జులా ?' అని అడిగాడు.

'మూడూ నిండురోజులుకూడా కాదు. రెండురోజుల పూాశే. ఇవాళ సాయంత్రంవరకు నువ్వు నాతోనే వుండాలి. పోగా మిగిలేది మూడు రాత్రులు, రెండు పగళ్లూను.'

'ఓ. కె. సర్ !'

'నేడు మంగళవారం; శుక్రవారంనాడు వుదయం 7 గంటలకు ఈ హత్యా రహస్యాన్ని ఛేదించి ఆ ప్రమాణాలను నా కిక్కడే అందజెయ్యాలి. 9 గంటలవరకు నే నవన్నీ పరికించి, 10 గంటలకల్లా పొలిటికల్ డిపార్టుమెంటుకు విశదీకరించాలి.'

'ఎస్, సర్!'

'ఈ హత్యాప్రభావం యేమిటో గ్రహించావూ ? నిజాని కిది మన ప్రయోజనాని కే జరిగిందనుకోవాలి కదూ?'

'ఎస్, సర్!'

'సరిగా నేటి కెనిమిదవనాటికి ఆ మహారాజు యిక్కడికి వస్తాడు. నాటినుండే తన గోతిని తన చేతుల్తోనే తవ్వుకోవలసివుంటుంది. వాషింగ్టన్! ఆ గొయ్యి నతడు తవ్వుకొనుటకే మనం యీ హత్యా ప్రమాణాలను ఉపకరణాలుగ సరఫరా చెయ్యాలి; తెలిసిందా ?' వాషింగ్టన్ 'ఎస్, సర్'కు మినహా యేమీ అనకుండ అతిశ్రద్ధతో వింటున్నాడు.

'ఈ హత్యారహస్యాన్ని ఛేదించటానికి మనం రెండు దార్లు తొక్కాలి. ఆ దురదృష్ట ప్రిన్సునుండి మన ఫైలులోకి చేరిందే—ఆ చెక్కుబుక్కు దాఖలా పదివేల రూపాయల

చెక్కును గూర్చి సమూలాగ్రంగా తెలుసుకోవటం ఒకటి. రెండోది నా వూహ ననుసరించి కేవలం మోహాంధరై హంతకునితోపాటు పరారైన పతితారాణిని కనుగొనటం. హంతకుడు దివాల్వాకోసం యిచ్చిన చెక్కింతవరకు క్యాష్ కాలేదు. అసలతని ఖాతాలో చెప్పదగిన మొత్తమే లేదని బ్యాంకువారి యిన్ఫర్మేషన్. పరారైన రాణిపేర యివ్వబడిన చెక్కుకూడా యింతవరకు బ్యాంకుకురాలేదు. తొంభై పాళ్ళది తిరిగి రాజాగారికే వాపసుచేసి మొత్తం వసూలు చేసుకోనబడి వుండాలి; లేదా పరారువ్యక్తులవద్దనైనా వుండాలి ... కాని సరిగా హత్యజరిగిన నాల్గవనాడు రాజాగారు తమ స్వంత నిధినుండి యిరవై వేల రూపాయలు వాడినట్లు స్పష్టమవుతోంది. ఆ మొత్తం రాణిపేర వ్రాసి యిచ్చిన చెక్కును తిరిగి సంపాదించుటకే వినియోగించబడి వుంటుందని నా విశ్వాసం. ఇంతవరకు అనుమానంపై నిర్బంధింపబడినవారందరు నిర్దోషులని తేలిపోయింది. ఏమైనప్పటికీ, సిగార్ కేసు తెరచి ఒకటి కార్యదర్శి కిచ్చి, తానొకటి ముట్టించి "హత్య జరిగిననాడే రాజాగారు సిమ్లాను వదలి వెళ్ళటం నిర్వివాదాంశము. మార్గమందలి ఒక స్టేషన్లో వారి కార్యదర్శి ఆనాడు వెలువడిన ఇంగ్లీషు, వర్నాక్యులర్ దినపత్రికలన్నీ కొనటంకూడా నిజమే. తర్వాత స్టేషన్లో ఆయన కార్యదర్శిని పిలిపించుకోవటం, జంక్షన్‌లో షాంపైన్ కొనివుండటం, యివన్నీ ఆయన మానసికాందోళననే తెలుపుతున్నాయి. ఆయన తమకూ రాణీకి మధ్య సంబంధమున్న విషయం ఏమాత్రం బయటపడటానికి యిష్టపడటంలేదని పై విష

యూలు నిరూపిస్తున్నవి... ...అందుకొరకే ఆయన పదివేల రూపాయల చెక్కు నిమిత్తం యిరవై వేలుగాని, అంతకంటె పెద్ద మొత్తాన్నిగాని వెచ్చించి వుండాలి. హంతకుడు అతి చతురుడు. అతడు చాలాకాలంనుంచి రాణితో వుంటున్నాడు. వారు కొన్ని వారాలనుండి ధనాభావంతో యిబ్బందిపడు తున్నట్టు విశదమైంది. హోటలు బిల్లుకూడా మృతవ్యక్తే చెల్లించుతూవచ్చాడు. అట్టి స్థితిలో పదివేల రూపాయల చెక్కును సొమ్ము చేసికొనకుండా రిక్తహస్తాలతో వెళ్ళి వుండడు. అయితే యిందులో వాడికి మరొకవ్యక్తి సహాయం వుండితీరాలి.'

'నిస్సందేహంగా, నిస్సందేహంగా' ఇప్పటికి నోరు తెరచి అన్నాడు వాషింగ్టన్. 'హంతకుడు చెక్కును మార్చ టానికి స్వయంగా బయటపడి ప్రమాదంలో చిక్కుకొనే టంతటి మూర్ఖుడుకాడు.'

'రైట్, రైట్'

ఆఫీసరు గట్టిగా ఒక దమ్ములాగి పొగ వదుల్తూ 'పరి శోధన మరొక విచిత్ర విషయాన్ని బయల్పరచింది. హత్య జరిగిననాటినుండి రెండు వారాలపాటు యిక్కడినుంచి వెళ్ళే ప్రతి రైలును, కారు, బండి మొదలైనవాటిమీద నిఘా వుంచబడింది. ఇందువల్ల ఫరారు వ్యక్తులు పై మార్గముల గుండా వెళ్ళలేదన్నది స్పష్టము 'సిమ్లా నగరము, సమీప పల్లెలు, కొండలు, గుహలు అన్నీ గాలించివేయబడినాయి. హత్యానంతరం వారిద్దర్నీ చూచినట్టుగాని, వారు ఫలానా దారిని వెళ్ళారనిగాని ప్రమాణం లభించలేదు. ఫరారీలు

కేవలం వృత్తిచేతుల్తో వెళ్ళలేదు. అవసరమైన సామాను చాలవరకు వెంట తీసికొనిపోయారు. అంతసామానూ వారే స్వయంగా మోసుకొని వెళ్ళడం అసంభవము. బండిమీద గాని, కూలీల సహాయంతోగాని వెళ్ళివుండాలి. ఇక్కడింకొక చిత్రమున్నది. సామాను మోసుకొని వెళ్ళినవారికి, చెక్కు సందర్భంలో తోడ్పడిన వానికీ సంబంధ ముండితీరాలి. ఈ రెండు పార్టీలకు డబ్బువిరివిగా వెదజల్లబడిందనటంలోకూడా సందేహానికి తావులేదు... ఆ చెక్కు విషయంలో సహాయ పడిన వ్యక్తే యావత్తు వివరాలు చెప్పగలడు.'

ఒక క్షణం యిద్దరూ దీర్ఘాలోచనాతత్పరులయ్యారు.

ఆకస్మికంగా ఆఫీసరు నోటినుండి క్రింది మాటలు వెలువడినై. 'ప్రభుత్వ బహుమతిప్రకటన చూచి అతడు మన వద్దకు వస్తే!'

వాషింగ్టన్‌కూడా అదే మూడ్‌లో తలపంకించాడు.

'నీ వీ యూహల నాధారంగా తీసుకొని హత్యారహస్యాన్ని భేదించగలిగితే నేటి కెనిమిదవనాటికి వేలమైళ్ళ విస్తీర్ణం, కోట్లకొద్దీ ఆదాయం కల్గిన ఆ సంస్థానం సునాయాసంగా మన చక్రవర్తి సామ్రాజ్యంలో చేరిపోతుంది.'

# 21

సంస్థానంలో ప్రజలు తిరుగుబాటు చేసినట్టూ, కాల్పుల ఫలితంగా చాలమంది గాయపడినట్టూ, హతులైనట్టూ వార్తలు భారతదేశమందలి పత్రికలన్నీ ప్రకటించినవి. ఆవార్తలతో సంస్థానమందే కాక బ్రిటిషు ఇండియాలో కూడా గగ్గోలు బయల్దేరింది. రాజకీయనాయకు లెందరో సంస్థానప్రభుత్వ నిరంకుశచర్యను ఖండిస్తూ స్టేటుమెంట్లు ఇచ్చారు. ప్రముఖపత్రికలు సంపాదకీయాలు కూడా వ్రాసినవి, ఈ హత్యాకాండను గురించి. భారతప్రభుత్వానికి ఈ విషయంలో జోక్యం కలుగజేసుకోవాలని అన్నిమూలలనుండి ప్రజలు విజ్ఞప్తులు పంపారు. ఇంత అలజడి జరుగుతూవుంటే వైస్రాయి మరి వూరకుండలేకపోయినాడు.

ఇంకా కాల్పులచే హతులైనవారి తలిదండ్రుల, సతీ - సుతల, చుట్ట - పక్కాల హాహాకారాల ప్రతిధ్వనులు చెవుల్లో గింగురుమంటూఉండగానే సంస్థానంవారికి ఎ. జి. జి. నుండి తాఖీదులు జారీఅయినవి. తంతివార్తలు రాసాగినవి. ఒకరోజున స్వయంగా ఎ. జి. జి. గారే వచ్చి మకాంచేశాడు. హిజ్ హైనెస్‌ను కలుసుకొని వెళ్ళాడు. మళ్ళీ మూడోనాడు తెల్లవారేసరికి సూటుబూటులతో మరోఇద్దరు వచ్చి దిగారు. గెస్టుహౌస్‌లో వారి కాదర సత్కారాలతో విడిది యేర్పాటయింది. వారొక సీలువేసిన కవరు నందజేశారు రాజావారికి.

ఏమిటాలేఖ? వారంటుకు తుల్యమైనది. వెంటనే హిజ్ హైనెస్ తమ కేబినెట్టు మీటింగు పిల్చారు. కేబినెట్

మెంబర్ల ఆకారాలు చిత్ర విచిత్రాలు. ఇంగ్లీషుమాత్రం కొద్దో గొప్పో అందరికీవచ్చు. కాని వేషాలు తలకొకరీతి. ఒకరు కమీజు, కండువా ధరిస్తే, మరొకరు కోటు, తలపాగ తగిలించుకొచ్చారు. ఒకరు క్రాఫు యెగదువ్వితే, వేరొకరు పిలకముడివేశారు. మొత్తం సభ్యులు ఆర్గురు. అందులో ఎక్కువమంది ఎన్నడూ పత్రిక ముఖమెరుగనిరకం.

సిమ్లానుంచి వచ్చిన శ్రీముఖం వారిఎదుట పెట్టబడింది.

ప్రధానమంత్రికూడా అందులో ఒక సభ్యుడే! అసలు భారత సంస్థానాల్లో కేబినేట్ సభ్యత్వ మేమిసభ్యత్వం! అక్కడ రాజే సర్వమూను. ప్రజాసామాన్యం కళ్ళలో దుమ్ము కొట్టటానికి ఏవేవో పదవులు కల్పించి తోలుబొమ్మల్ని కూర్చోబెట్టడమేగా! వారంతా నిర్జీవ ప్రతిమలే! రాజుగారి అభిప్రాయాన్ని వ్యతిరేకించటానిగ్గాని, సవరించటానిగ్గాని ఈ జోహుకుందార్లకు దమ్మెక్కడిది? సభ్యత వున్నత స్థాయిలోవున్న యీ యిరవయ్యో శతాబ్దంలోకూడా సంస్థానాధిపతులు తమరాజ్యాల్లో యేమిచేసినా చెల్లిపోవాలంటారు.

బ్రిటిష్ ప్రభుత్వమువారి పోటుపడలేక చాల సంస్థానాల్లో కేబినెట్టులైతే యేర్పడ్డాయి గాని, వాటి సభ్యుల హోదా హెడ్ గుమాస్తాల గౌరవాని కేమాత్రం మించి వుండదు. వారిపట్ల రాజుకు విశ్వాసమూ లేదు; ప్రజలకు భక్తీ శూన్యం. మరి వీరిని 'దిష్టిబొమ్మ'లే అనవచ్చు.

సభ్యులంతావచ్చి కూర్చున్న తర్వాత మహారాజుగారు వేంచేశారు. వారిముఖం కళా విహీనమై, కళ్ళు లోతుకు

దించుకుపోయి వున్నాయి. సభ్యులందరులేచి యెదురెళ్ళి వందనంచేశారు. ఆయన పరధ్యానంతోనే వారి నమస్కారములను స్వీకరించి వున్నతాసనముపై ఉపవిష్టులైనారు.

సభ్యులుకూడా ఆసీనులైన తర్వాత ప్రధాని రాజు ముందు కొన్ని కాగితములుంచాడు. హిజ్‌హైనెస్ రవంతసేపు కాగితాలు అటు ఇటూ తిరగవేసి పట్టుకుపోతున్న గొంతుతో సభికుల నుద్దేశించి 'మీరంతా చూచారా?' అని అడిగారు. వాస్తవంగా ప్రధాని మినహా ఆ శ్రీముఖాన్నెవరూ చదవలేదు. అయితే ప్రస్తుత ఆందోళనను గూర్చి వారు వినకపోలేదు. అందరూ ఆ తాఖీదును తుదివరకు చదివినట్టె తలలూపారు.

'మేము వెళ్ళితీరవలసిందే. తప్పదు. వచ్చినవారు 'సందేహానికి తావులే'దనే చెప్తున్నారు.' హిజ్‌హైనెస్ స్వరంలో విచార మిమిడివుంది. సభ్యులు వూపిరిబిగబట్టి వింటున్నారు.

'ఇప్పుడు మా మనస్సులో వున్నదంతా మీకు విప్పి చెప్పటం వుచితమని తలుస్తున్నాము. మేము సిమ్లావెళ్ళి తిరిగిరావటం జరగదనే మా వుద్దేశం—' ఇక్కడవారి కంఠము రుద్ధమైనది. ఇక శ్రోతలకంఠాలు మాట్లాడనక్కరలేకుండానే పట్టుకుపోతున్నాయి.

'మాకు స్వవిషయంలో ఏమాత్రం చింతలేదు; కాని, రాజపరివారంలో యెవరికి యెట్టిహానీ కలుగరాదని మా యభిలాష. మాకు సంతులేని కారణాన రాజ్యం విషయంలో యేమి నిర్ణయం జరుగుతుందో చెప్పలేము. మేము లేనప్పుడు

మీ రాజకుటుంబంలో యెవరికి యెట్టిచిక్కులు సంభవించనీ యమని మీరు ప్రమాణంచేయగోరుతున్నాము.'

తక్షణం అందరూ లేచి శపథంచేశారు. 'ఆనాడు మనచేతులార అహితము జరిగినవారికుటుంబాలకు నష్టపరిహారం యిప్పించుటకు ఆర్డరు జారీచేసి వివరాలను సేకరింప వుద్యోగుల నియమించాము. ఆ యేర్పాట్లు త్వరలో పూర్తి చేయు బాధ్యత మీకు అప్పగిస్తున్నాము.'

దీని కందరు 'సరే' నని తలలూంచారు. శ్రీవారి ముఖంలో, స్వరంలో క్రమేపి నిస్పృహ-నిరాశాభావాలు ప్రస్ఫుటం కాజొచ్చినవి. వారి చూపులు కాంతిహీనము లైనవి. పెదవులు తడియారిపోయినవి. ఇరవై నాలుగు గంటలనుండి సురపేరైనా తలచకుండా ఉండటం చాల సంవత్సరాలకుగాను యిదే తొలిసారి. అంచేత వారికి తమ మనసు, హృదయం అన్నీ శూన్యంగా వున్నట్టు తోచింది. వారు ఇలా ముగించారు—

'మే మీ రాత్రికే బయలుదేరబోతున్నాము. మేము ముందే చెప్పివున్నట్టు ఎట్టి విపరీతవార్తలు వినవచ్చినా మీరు బెంబేలుపడకండి ... మేము మా అనంతరవారసును నిర్ణయించాము. మీ కాబోవురాజును మారాణికి అప్పగించాము. మా యీ కోరికకు అంతరాయ మేర్పడదనే మా నమ్మిక. ఇక ఆ బాలుకు యుక్తవయస్కుడగువరకు అతి జాగరూకతతో పెంచి, విద్యా—బుద్ధులు నేర్పించి ఆదర్శ సంస్థానాధిపతిగ తయారుచేయుభారం మీదే. ఇదే నా వీలునామా.'

## 22

హిమాలయప్రాంతంలో ఒక ప్రశాంతమైన లోయ. అక్కడ ఒక పటకుటీరం వెలిసింది. ఒక ఆటవికుని సేవకుని పెట్టుకుని సాకీ, హర్ హైనెస్ లా కుటీరంలో కాపురంచేస్తున్నారు. వారు సామాను మోసుకొచ్చిన కూలీలను ఎప్పుడో వదలివేశారు. తమ యీ వునికి యెవరికీ తెలియకుండా ఉంటానికి వారు మార్గంలో అక్కడక్కడా కూలీలను మార్చుకుంటూ వచ్చారు. ప్రస్తుతం వీరిదగ్గర వున్న సేవకుడు అమాయకుడూ, విశ్వాసపాత్రుడూను. వీళ్ళు యిక్కడ ఎందుకు ఉంటున్నారో వాడి కేమీ తెలియదు. తెలుసుకోవాలన్న అభిలాషకూడా లేదు ఆ మోటుమనిషికి. ఆలోయ ఇతరుల కగమ్యము. అక్కడి కెవరైనా వస్తారనే అనుమానానికి ఆస్కారమే లేదు. సమీపంలో వూరు, పల్లె ఏదీ లేదు. చుట్టుప్రక్కల యెక్కడా అడుగుజాడలైనా కన్పించవు.

ఇంకామంచువర్షాలారంభించలేదు; అయినా అక్కడి చలి సహింపరానిదే. ఆ మంచు, చలినుండి కాపాడుకోటానికి తగిన వున్నిదుస్తులు వారివద్ద లేవు. ఏం చేస్తారు మరి? ఇక్కడికి చేరగానే పర్వత ప్రాంతాల్లో తయారయ్యే బొచ్చు బట్టలు సంపాదించారు, హర్ హైనెస్ చీనిచీనాంబరాలు, సిల్కు, జార్జెట్ చీరలు, సాకీ ట్వీడుసూట్లు, కోట్లు పనికిరాకుండాపోయినై. కొద్దికాలంలోనే వారిద్దరు ఆటవిక దుస్తులతో ఆనవాలుపట్టలేనంత మార్పుచెందారు. చలి తీవ్రత హెచ్చితే యింకా దిగువకు పోదా మనుకున్నారు. ఋతువు

మారగానే ఆ దుర్గమారణ్యాల సరిహద్దు దాటి అవతలి దేశం చేరుకోదలచారు. కాని వెళ్ళేముందు తమ భావిజీవితం సుఖప్రదంగా గడపటానికి చాలినంత పెద్ద మొత్తాన్ని యెలాగైనా సంపాదించాలని సాకీ కోరిక.

సాకీ సాంగత్యదోషం వల్ల దుశ్శీలుడైనాడే గాని, లేకపోతే అతడొక వీరుడు కావలసినవాడు. హర్‌హైనెస్ మీద అచంచల ప్రేమ వుండుటచేత గాని, లేకపోతే ఆమె తనతో యిన్ని బాధలు పడటానికి సుతరాం ఒప్పుకునే వాడు కాడు. తా నామెను విడచి వుండలేకున్నప్పటికీ సిమ్లానుండి బయలుదేరిన లగాయతు ఆమెను తిరిగిపోయి సుఖించమనే హెచ్చరిస్తూవచ్చాడు. అయితే మాత్రం ఆమె యెలా వెళ్తుంది-మోహంలో చిక్కిన తర్వాత! కల్లు కష్టంమీద కూడా మింగుడుపడక క్రమంగా వారు తాగుడు తగ్గించివేశారు. ఆవాళ ఎండ చాల తీవ్రంగా ఉంది. ఆకాశం స్వచ్ఛంగా ఉండి ఉదయంనుండి వర్ష పుచినుకు లేదు. పిట్టలు అరుస్తున్నై. వాతావరణమంతా ఆహ్లాదకరంగా ఉంది.

హర్ హైనెస్ మామూలు దుస్తులు వదలి సిల్కుచీర జార్జెట్ జాకెట్టు ధరించింది. పైన కాశ్మీర్ శాలువ కప్పుకున్నది. సాకీ జుట్టు గడం పెరిగి సిక్కులాగున్నప్పటికి, వాగులో శుభ్రంగా స్నానంచేసి పాయిజామా, సిల్కులాల్చీ వేసుకొని హుషారుగా వున్నాడు. నౌకరు వేటాడి ఒక అడవి మృగాన్ని తెచ్చాడు. ఇద్దరూ కలసి పక్వంచేసుకొని ఆప్యాయంగా ఆరగించారు. లోపల రాళ్ళూ - రప్పలతో రెండు అరుగులు ఏర్పరచబడివున్నై. అవే వారి కక్కడ కుర్చీలూ,

సోఫాలూ, మంచాలూను. వాటిలో ఒక దానిపైన హార్ హైనెస్ కూర్చుని రెప్పలార్చకుండా ఒక పుస్తకంలోని పుటలను తిరగవేస్తోంది. సాకీ అడుగులో అడుగేసుకుంటూ వచ్చి రెండో దిమ్మమీద కూచున్నాడు.

ఆమె నీరసంగా నవ్వి చూపు అతనిపైకి తిప్పి 'ఈ ప్రకృతిసౌందర్యంమధ్య నేటివాతావరణం ఎంత బాగుంది' అంది. ఆ చిరునవ్వుదొంతర్ల వెనక దాగివున్న వేదనను పసికట్టి సాకీ లోలోపలే బాధపడ్డాడు. ఆమె ఆవేదనకు కారణం తానేగదా యని సిగ్గుపడుతూ 'అవును, చాల అందంగా వుంది హుజూర్' అన్నాడు.

'మన పూర్వపురోజులు మళ్ళీ తిరిగివస్తే!' హార్ హైనెస్ పుస్తకం కిందపెట్టి సంధ్యారుణకాంతులను తిలకిస్తూ అంది.

సాకీ పెద్ద నిట్టూర్పు విడిచాడు. ఆమె అతనిముఖం వంక తేరిచూస్తూ మళ్ళీఅంది—'ఉండుండి నువ్వింత దిగులు పడతావేం సాకీ?' అతడు ప్రత్యుత్తరంగా మరొకసారి దీర్ఘ శ్వాస వదలి తల దించుకున్నాడు.

'సాకీ నువ్వీవైఖరిని వదిలెయ్యి. జరగాల్సింది జరిగింది, కానున్నది కాకమానదు. వృథాగా మనసు కించపరచుకున్నందువల్ల వచ్చేదేముంది?'

'తమ రన్నది యథార్థమే. మీ మనోనిబ్బరం మెచ్చుకోదగిందే; కాని నేను మానవ మాత్రుణ్ణి హుజూర్! ఎంత ప్రయత్నించినా మనోదౌర్బల్యం వదలకున్నది. ప్రతి నిముషం నా నెత్తిమీద హత్యాపరాధం వుందనీ, తమ

యీ నిర్వాసానికీ, కష్టపరంపరకు యీ దౌర్భాగ్యుడే కారకుడనీ నాహృదయం కుమిలిపోతోంది'.

'ఇప్పు డది పాతపడిపోయిందిగా. ఇక ఆ సంగతులు తలపెట్టకు.'

'ఎలా మరువగలను? హత్యాపరాధం నా గుండెను బ్రద్దలుచేస్తోంది. ప్రతి నిముషం మరణానికి తయారుగానే వున్నాను; కాని, తమ యీ దుస్థితికి నా గుండె నీరవుతోంది. తమ కిన్ని చిక్కులు తెచ్చిపెట్టటానికి నాకేమి హక్కుంది? నా యీ పాపానికి శిక్షేమిటో ఆ దేవునికే తెలియాలి.'

హార్ హైనెస్ నిలువునా నీరుకారిపోయింది. దిగాలుపడి చూస్తూ ఆర్ద్రస్వరంతో అంది- 'చింతించకు సాకీ! ఇది మన యిద్దరికీ ఆపత్కాలం. ధైర్యంగా గడిపివేద్దాం. నా కష్టదశలో నువ్వు నన్నంటిపెట్టుకొని వున్నావు. ఇప్పుడు నేను నిన్నుమాత్రం యెలా విడిచిపోతాను? మోహం, ప్రేమ...పిచ్చి! ఈ పిచ్చికోసం ప్రాణాలైనా బలియిస్తాను.'

సాకీ కన్నులానందబాష్పపూరితాలైనాయి. కృతజ్ఞతాపూర్వకంగా-'తమ అభిమానానికి కృతజ్ఞుడను, యువర్ హైనెస్!' అన్నాడు.

హార్ హైనెస్ లేచి సాకీ పక్కన ఆనుకొని కూర్చుంది. రెండుచేతులు అతనిమెడకు చుట్టి 'మై డియర్! నువ్వేమీ విచారించకు. మనం పర్వతాల్లో, అడవుల్లో స్వేచ్ఛావిహారంచేద్దాం. ఆకూ, అలమూ తిని బ్రతుకుదాం. విధి ఎదురుతిరిగితే పర్వతశిఖరంమీదినుంచి దూకి ఒకేసారి ప్రాణాలు విడుద్దాం; కాని, విడిపోవద్దు. విడిపోము.'

ఆమెమాటల కతను కరిగిపోయాడు. సర్వం మరిచాడు. ప్రేమవిహ్వాలుడై ఆమెను గట్టిగా కౌగలించుకున్నాడు. ఆమెకూడా ఆనందంతో తన్మయత్వంచెందింది. కొన్ని నిమిషాలలాగేవుండి వుద్రేకం శమించిన తర్వాత విడివడ్డారు. 'ఒక్కసారి నన్ను పోనివ్వండి. మన జీవితాలు సుఖప్రదంగా వెళ్ళబుచ్చటానికి తుది ప్రయత్నం చేసి చూస్తాను.'

'వద్దు, వద్దు. ఆ మాట నా చెవిని పడకూడదు. అందులో ఎంత ప్రమాదముందో తెలుసా?'

'ప్రమాద మేముంది? కర్మచాలకపోతే పట్టుపడతాను. అంతేగా?'

'మరి అంతకంటే ప్రమాధ మింకేం కావాలి?'

సాకీ జేబులోనుంచి రివాల్వరు తీసి గుండె కానించుకొని కళ్లతో సైగచేశాడు. ఆమెగుండె గుభేల్‌మంది. వణకుతూవున్న చేత్తో సాకీచెయ్యి పట్టుకొని 'నీ ఉద్దేశమేమిటి సాకీ? నన్నీ కానిచోట తల రాతికేసి కొట్టుకొని చావమనా?' అంది బిక్కమొగంతో. అతడు నవ్వి రివాల్వరును క్రింద పెట్టాడు. హర్‌హైనెస్‌ను దగ్గరకు లాగుకొని 'తమ ఆజ్ఞకు బద్ధుణ్ణి హుజూర్! నా ప్రాణంపోయేవరకు మీ సేవచేస్తాను.'

ఆమె అతని భుజంమీదకొరిగి వాని కళ్ళల్లో కళ్ళెట్టి చూస్తోంది.

# 23

సిమ్లాలో అదే హోటలు. కాని ఈ పర్యాయం పూర్వపు ఠీవి, భోగవిలాసాలూ నామమాత్రానికైనా లేవు. హిజ్ హైనెస్‌తో వారి కార్యదర్శి, యిద్దరు నౌకర్లూ వచ్చారు. వారి నిమిత్తం ప్రత్యేకింపబడిందకూడా మూడుగదులే.

శ్రీవారు సిమ్లాకు విచ్చేసి ఇరవైనాలుగు గంటలయింది. వారి కార్యదర్శి వ్యాకుల చిత్తంతో గదిలోనుంచి వరండాలోకీ, వరండాలోనుంచి గదిలోకీ కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. గదిలోవుంటే హోటల్లోకి వచ్చి పొయ్యే వారు కనిపించరు; అంచేత వరండాలోకి వచ్చినపుడెల్లా క్రిందికి వంగి చూస్తున్నాడు. ఈ చూడటం హిజ్ హైనెస్ కోసమే. చీకటి పడుతోంది. ఏటవాలుగవుండే సిమ్లారోడ్ల మీద యెలెక్ట్రిక్ దీపాలు ఒక్కసారిగ వెలిగి వింతశోభను కూర్చుతున్నాయి. జోడుగుర్రాలబగ్గీ వచ్చి హోటలుముందాగింది. బగ్గీనుంచి దిగుతున్న హిజ్ హైనెస్‌ను చూచి కార్యదర్శి గబగబ క్రిందికి వెళ్ళాడు. అప్పటికి వారు లిఫ్టును సమీపించారు.

కార్యదర్శి యెదురెళ్ళి దణ్ణంపెట్టి, వారిచేతిలోని బెత్తాన్నందుకున్నాడు. వారిముఖంలో విషాదచ్ఛాయ లలముకొని వున్నాయి. మాట్లాడకుండ లిఫ్ట్‌మీద అడుగుపెట్టారు. కార్యదర్శి అనుసరించాడు.

గదిలో ప్రవేశించగానే కోటైనా విడువకుండా ఆయన ఈజీచైరులో జేరగిలబడ్డారు. కార్యదర్శి ముఖం వెలవెల

పోయింది. ఒక నిముష మలాగే చూసి, తర్వాత ముందు కెళ్ళి అడిగాడు. 'హుజూర్ వారికి కులాసాగా లేదా?'

జవాబు లేదు. కార్యదర్శి ముఖం మరింత మ్లానమైంది.

కొన్ని నిమిషాలు గడచిన తర్వాత పెద్దగా నిట్టూర్చి 'కూర్చో చంద్రకాంత్!' అన్నారు మహారాజాగారు.

చేతుల్లేనికుర్చీ నొకదాన్ని దగ్గరకులాక్కొని కార్యదర్శి కూచున్నాడు.

'అలసిపోయారా సర్కార్?'

'అవును, అలసిపోయాను, అల ... సి ... పో ... య్యాను. నన్ను నిలువునా దోచేశారు. అంతేకాదు: నిర్జీవ ప్రతిమను చేశారు' అని శిథిలహృదయంతో వెనక్కు ఒరిగిపోయ్యారు.

కార్యదర్శి ముఖంలో కత్తివాటుకుర క్తపుచుక్క లేదు. మొదటినుంచి ఎవ రెన్ని చెప్పినా అశుభసూచనలే కన్పించాయి. ఇప్పుడు హిజ్ హైనెస్ వాలకంచూచి వారి అంధకారమయ భవిష్యత్తు నూహించటానికి చంద్రకాంతునికి ఎంతసేపో పట్టలేదు. అయిదు నిమిషాలు మౌనముద్ర వహించి 'నా కేమి సెలవు యువర్ హైనెస్?' అనిఅడిగాడు.

హిజ్ హైనెస్ కలకంటున్న వానివలె ఉలిక్కిపడి 'నీకా? నీ కేమి ఆజ్ఞయిస్తాను? నువ్వు నా వద్ద నేవుండు చంద్రకాంత్! నా కిప్పుడేదైనా ఆధారం వుండితీరాలి.'

చంద్రకాంతుడు తన కుర్చీని మరింత దగ్గరకు జరుపుకొని 'నేను తమచరణసన్నిధినే వున్నాను. ఇక వుంటాను కూడా హుజూర్!' అన్నాడు.

'చంద్రా! సర్వనాశన మైందోయ్!'

అతడు చెవులు రిక్కించి వింటున్నాడు.

'నేను చాలా రోజులనుంచి అపకీర్తిని పోగొట్టుకోవాలనీ, రాచరిక బాధ్యతనుండి తప్పించుకోవాలనీ అనుకుంటున్నాను. ఈ విషయం మనం క్రితంసారి యిక్కడికి వచ్చినప్పుడు వైస్రాయిగారితో విన్నవించిన సంగతి నీకూ తెలుసు' శ్రీవారు ఆయాసంతో మాట్లాడలేకపోయారు. కొంచెమాగి 'కాని, నా సర్వస్వం దోచుకుంటా రనుకోలేదు. రాజ్యము, గౌరవము-అన్నీ చెయిదాటిపోయినై. ఇప్పుడు నే నీ ప్రపంచంలో బ్రతికివుండి ఏం ప్రయోజనం చెప్పు?'

చంద్రకాంతునికి ఏమనాలో తోచలేదు.

'చాలా ఘోరం జరిగింది.' అని తలుపు మూసివేయమని చేసన్నతో చూపారు. కార్యదర్శి లేచివెళ్ళి గడియ వేశాడు.

'మహా ఘోరం! నాపై యెట్టినేరాలు మోపబడినాయో యెరుగుదువా చంద్రకాంత్?' అతను హృదయంలో వున్న సానుభూతిని కళ్ళతో ప్రకటించటానికి ప్రయత్నించాడు.

'నామీద రెండునేరాలు మోపారు. ఒకటి: బ్రిటిష్ యిలాకాలో హత్యకు సహాయపడినానని. రెండోది: పరిపాలనలో అసమర్థుడనై ప్రజలపై అన్యాయంగా కాల్పులు జరిపించి వారి ప్రాణాలు బలిగొన్నాననీ.'

చంద్రకాంతుడు నల్లత్రాచును తొక్కినంత కంగారు పడ్డాడు. అప్రయత్నంగా అతను 'ఆఁ'! అన్నాడు.

'అవును, చంద్రకాంత్! నేనూ నీవలెనే హైరానయ్యాను. మొదటినేరం... కాని నామొర వినేదెవరు?' దుఃఖాతిరేకంవల్ల ఒకక్షణమాగి 'ఆనాడు దొంగిలించబడిన చెక్కుబుక్కు—నీకు జ్ఞాపకముందనుకుంటాను—అది నే డిక్కడ చూశాను. మేము అప్పుడు స్వంత నిధినుండి విత్ డ్రా చేసిన యిరవై వేల రూపాయలు హంతకుడు పరారవటాని కేయిచ్చానని నాకు వ్యతిరేకంగా నిరూపించాడు... నేను చెప్పినది వినకపోగా—నా శోకము ఇబ్బడికాగా—నాది కల్పితవిషాదమనీ, నటనఅనీ తూలనాడి, కసరికొట్టారు.'

చంద్రకాంతుడు వుండబట్టలేక 'చివరి కేమైంది సర్కార్?' అన్నాడు.

'ఆజన్మనిర్వాసము, నెలకు వేయిరూపాయల పెన్షను, దత్తతహక్కు రద్దు... బతికివుండగా సంస్థానంలో ప్రవేశించరాదు. ఆత్మీయులతో... స్వంత ఆస్తిమీద హక్కుకూడా అంతరించిపోయింది చంద్రకాంత్!'

ఆపైని మరి మాట రాలేదు. కన్నీరు కారుస్తూ తల వంచుకున్నారు.

## 24

సెక్రటేరియట్‌లో అదే చీకటిగది. ఉన్నదికూడా ఆ వెనకటి దొరలిద్దరే. ఆఫీసరుచూపులో ఆనందమూ, వాషింగ్టన్‌ముఖంలో విజయదర్పమూ తాండవమాడుతున్నవి. ఇద్దరూ చుట్టలు కాలుస్తున్నారు.

'మన గమ్యస్థానానికి ఇప్పటికి చేరుకున్నది ఒక మజిలీయే. రెండో మకాముకూడా చేరుకొని న్యాయరక్షణార్థం హంతకుణ్ణి శిక్షించాలి.'

'తప్పని సరిగ' అని సమర్థించాడు వాషింగ్టన్.

'హంతకుడు పట్టుబడతాడని నీకు నమ్మక ముందా?'

'వాని అంతు కనుక్కొని తీరుతా.'

'అంటే మనిషిని పట్టుకోవటం అసంభవమనేనా నీవనేది?'

'ఎస్. పట్టుకోవటం వేరు, పత్తాతీయటం వేరు...... ఫరారువ్యక్తుల పోలికలుగల స్త్రీ - పురుషులిద్దరు హత్య జరిగిన మర్నాడు, మూడోరోజున సిమ్లాకు దూరదూరంగా పర్వతవాసుల్తో సామాను మోయించుకుంటూ కాలిత్రోవను నడచిపోతున్నట్టు చూచినవాళ్లు చెపుతున్నారు. వాళ్ళ స్టేటుమెంట్లు రికార్డు చేయబడినవి; కాని, ఆచూకి తెలిపిన వారు పేర్కొన్న దిశలుమాత్రం పరస్పర విరుద్ధంగావున్నై. దీన్నిబట్టి హంతకుడు తమ ఉనికి తెలియకుండా చేయటానికి యుక్తిగా పామునడకలతో వెళ్ళిఉండాలి; లేక చూచినవారు చెప్పటంలో పొరపడివుండాలి. ఏమైనప్పటికీ ఆ మార్గాలన్నిటి అంతూ తేల్చుకొని రమ్మని మనుష్యుల నంపాను. ఇంకా వారిజాడ చిక్కలేదు. ఆ మార్గాలలో రెండు స్పష్టంగాలేక సరిహద్దులు దాటిపోయేవిగా వున్నవి. అవి వంకర టింకరలై ఎగుడు-దిగుడుగా వున్నవి. ఆ ప్రదేశాలు భయంకర క్రూర మృగాలుఉండేవి. అట్టిత్రోవల్లో ఒక సుకుమారాంగన నడిచి వెళ్ళటం అసంభవం.'

ఆఫీసరు చుట్టపొగ వదలుతూ అందులో యేదో చదువ ప్రయత్నించేవానివలె చూస్తూ 'మోహాంధ, మోహాంధ!' అని గొణిగాడు

'వాళ్ళిద్దరూ సాహసించి సరిహద్దుదాట ప్రయత్నించటంలో, కావలివాళ్ళ కంటపడకుండ తప్పించుకొన ప్రయత్నించటంలో అంతరించివుండాలి; కాకపోతే అసలందాక చేరకమునుపే ఏ క్రూరమృగం వాతనో, ఏ ఆటవికుని బారినో పడి విగతజీవులై వుండాలి. ఇప్పుడు వారి శవాలయినా కన్పిస్తాయేమోనని ఆ ప్రాంతాలన్నీ గాలించుతున్నాను.'

'అయితే వారి కళేబరాలను మాత్రమే పట్టుకోగలవని భావించుతూవున్నావన్నమాట. వారీ సరికి మరణించి వుంటారనేగా నీ నమ్మకం?'

వాషింగ్టన్ కొంచెం సిగ్గుపడి 'అంతే' నన్నాడు. ఆఫీసరు ఒక క్షణమాగి గంభీరుడై చుట్ట నవతల పారవైచి చెప్పసాగాడు.

'నీ వూహ పొరపాటు వాషింగ్టన్! ఎందువల్లనంటే నువ్వు రెండు సందర్భాల్లో స్పష్టమైన నిర్ధారణకొచ్చావు. ఒకటి – హంతకుడు చతురుడనీ, గుండెనిబ్బరం కలవాడనీ. ఇక రెండవది–వారివద్ద కొన్ని వేల రూపాయలనగదువుందనేది. ఏం, అంతేనా?'

'అవును' 'ఈ రెండూ నిజమే అయితే, హంతకుడు నువ్వనుకున్నంత తేలిగ్గా ప్రాణం కోల్పోడు. తన ప్రేయసిని మృత్యుగహ్వరంలోకి వదలడు.'

'కాని, ప్రాణం నిలుపుకోటం, నిలుపుకోకపోవటం ఒకరిచేతిలోలేదు' అని వాషింగ్టన్ తనవాదనను సమర్థించుకోబోయాడు.

ఆఫీసరు నిశితదృష్టిని బరపుతూ, నిశ్చలస్వరంతో "ఫరారువ్యక్తులిద్దరూ జీవించివున్నారనే నా విశ్వాసం. ఇందుకు నీ మొదటి నిర్ధారణే ఆధారంకూడాను' అన్నాడు ఖచ్చితంగా. తన పై అధికారి వూహాలూ, నమ్మకాలూ అమోఘాలని వాషింగ్టన్‌కు తెలుసు. ఆయన అంత దృఢంగా చెప్తూతూవుంటే అతను మరి కాదనలేకపోయాడు.

'నువ్వు అసలు విషయాన్ని తెలుసుకోటానికి అవలంబించిన విధానం, తొక్కిన మార్గం సరిఅయినవే. అంతవరకు నేనూ నీతో ఏకీభవిస్తాను. పోతే యిక మనకున్న వ్యత్యాసం పర్యవసానంలోనే.'

'ఐతే వాళ్లు నేపాలుకో,టిబెట్టుకో చేరుకునివుంటారనా మీా భావం?'

'అది ఆలోచించతగ్గ విషయం... నేపాలులో ప్రవేశించటానికి వారు సాహసించి వుండరు. టిబెట్టుకు పోయి వుంటారనుకోటం అసంగతంకాదు కాని, టిబెట్! ఓ! నిజంగా ఆమార్గం ఎంత ప్రమాదభూయిష్టం!'

గురుశిష్యులిద్దరు కొంతసేపటివరకు భావప్రపంచంలో విహరిస్తూ వుండిపోయారు.

# 25

హార్ హైనెస్, సాకీ అక్కడినుంచి ప్రయాణమై పోవడానికి నిశ్చయించుకున్నారు. తమవద్దనున్న కొద్ది మొత్తంతోనే టిబెట్టుకు ప్రవాసంపోదలచారు. ఈ యాత్రలో ప్రాణాలైనా కోల్పోవాలి, లేదా టిబెట్ చేరుకొని సుఖ జీవితమైనా గడపాలని నిశ్చయించుకున్నారు. పర్వత ప్రాంతంలో ప్రవేశించినది మొదలు సాకీ టిబెట్‌కు వెళ్ళే రహస్య పర్వతమార్గాలన్నీ తెలుసుకోన ప్రయత్నించాడు. అయిదారు మ్యాపులు కూడా గీశాడు. ఒక నౌకరు వుండనే వున్నాడు, తోడుగా వుంటానికి మరో యిద్దర్ని యేర్పాటు చేసుకున్నాడు. తంటాలు పడి పడి మూడు తుపాకులుకూడా సేకరించి వుంచాడు. అజ్ఞాతవాసంలో హార్ హైనెస్‌కు గురి పెట్టి కాల్చడంలో తర్ఫీదు యిచ్చాడు.

ప్రయాణ సన్నాహం పూర్తి కావచ్చింది. సామాను మూటలు కట్టారు. ఇక కొద్దిసేపట్లోనే ఆ కుటీరం నిర్మానుష్యమైపోతుంది.

ఇద్దరూ నాస్తాచేసి నౌకర్లకున్కూడా పెట్టారు. దుస్తులు మార్చి ప్రయాణానికి సిద్ధమయ్యారు. సాకీ జుట్టూ, గడ్డం దువ్వి, పెద్ద తలపాగ చుట్టి,ఉన్నికోటు వేశాడు. హార్ హైనెస్ ఉన్నిపాయజామా,బనియనూ,దానిపైన ఉన్నికమీజుతొడిగి తలకు మఫ్లరుచుట్టింది.నౌకర్లుపెట్టెలు, మూటలు నడుములకు బిగించికట్టుకొని బయల్దేరారు. సాకీ, హార్ హైనెస్‌లు కుటీరం అంతా ఒకమారుపరిశీలించి బయటికొచ్చారు. సాకీ అగ్గిపెట

చేత్తోపుచ్చుకొని చూరుకిందికి వెళ్తున్నాడు. ఆమె మమ కారంతో కుటీరంవేపు ఒకసారీ, నిప్పంటించుతూన్న సాకీవంక ఒకసారీచూస్తోంది. సాకీ మండుతోన్న అగ్గిపుల్లను చూరుకు అంటించబోతున్నాడు. ఇంతలో ఒక కేకవినిపించింది. అందరూ చకితులై వెనక్కి తిరిగి చూచారు. చిత్రం! హిజ్ హైనెస్, చంద్రకాంతుడు ఇంకా నలుగురు మనుషులు!

సాకీ, హర్ హైనెస్‌లు నిర్ఘాంతులయ్యారు. కలలో నైనా వూహించిఉండని ఘటన. వారి హృదయాల్లో తుఫాను రేగింది. ఆమె ఒక క్షణం కళ్ళు మూసుకున్నది. మరు నిముషంలో ఆమెముఖంమీద మెరుపు మెరిసినట్ట యింది. పెద్ద బరువేదో దించినట్టు మనసు తేలికపడింది.

సాకీ గుండెలో ముల్లు గుచ్చుకున్నట్టుంది. జేబులోకి చెయి వెళ్ళింది అయాచితంగా. రివాల్వరు పైకి తీసి పది అడుగులు వెనక్కి వెళ్ళాడు. హర్ హైనెస్ అతని కలవర పాటు, చర్యలను గమనించుతూనే వుంది. రివాల్వరు చూచి కంగారుపడింది. రెండు చేతులూ పైకెత్తి 'ఆగు సాకీ! త్వర పడకు. ఎందుకొచ్చారో తెలుసుకుందాం.' అన్నది.

సాకీ చేసన్నతో నౌకర్లను తన వద్దకు రప్పించు కున్నాడు. వాళ్ళు సామానుదింపి చేతులుకట్టుకొని నిల బడ్డారు. హిజ్ హైనెస్ కొండపైనుంచి గబగబదిగివచ్చారు. వారివెంటవున్న సేవకులు వెనుకపడ్డారు; కాని చంద్ర కాంతుడు వారిని అనుసరించి వస్తూనేవున్నాడు.

'డియర్, వచ్చాను. నీకోసమే వచ్చా'నని హిజ్ హైనెస్ అల్లంతదూరాన్నుంచే హర్ హైనెస్ నుద్దేశించి

అన్నారు. అంతవరకు హర్ హైనెస్ రెప్పవాల్చకుండా వారి వంకచూస్తూవుంది. వారు ఎదుటికిరాగానే ముందుకెళ్ళి వారి పాదాలమీద వాలింది. ఇన్నాళ్ళనుంచివున్న ఉక్రోషం, ద్వేషం, ప్రతీకారవాంఛ పొగమేఘాలవలె యెగిరిపోయినై.

సాకీ ప్రతిమలాగున యిదంతా చూస్తూనేవున్నాడు. అతని కళ్ళముందు కారుచీకటి కమ్మింది. రివాల్వరు చేతి పట్టు తప్పి క్రిందపడింది. అతడు ఆ చేత్తోనే హిజ్ హైనెస్‌కు శాల్యూట్ చేశాడు. వారు సిక్కులాగున్న సాకీని పోల్చుకుని, మాట్లాడకుండా ముఖం త్రిప్పుకున్నారు.

హర్ హైనెస్ మూర్ఛపోయింది. వారామెకు శుశ్రూష చేయసాగారు.

చంద్రకాంతుడు 'హల్లో, మిష్టర్!' అంటూ రాతి బొమ్మలా నిలబడి చూస్తున్న సాకీని సమీపించాడు. సాకీ మనస్సు అల్లకల్లోలంగావుంది. నోరు తెరవకుండానే కరస్పర్శకు చంద్రకాంతు డందించిన చేతిని గట్టిగా నలిపాడు. 'ఏమిటి విశేషాలు?' చంద్రకాంతుడు పరామర్శ చేశాడు.

సాకీ గుడ్లుమిటకరిస్తూ అతిభయంకరంగా ఒకసారి హర్ హైనెస్‌నూ, మరొకదఫా ఆమెపైకివంగి తల నిమురుతున్న హిజ్ హైనెస్‌నూ చూస్తున్నాడు. వాని యీ ప్రవర్తనకు చంద్రకాంతుడు చిన్నపుచ్చుకున్నాడు.

సాకీ మెల్లమెల్లగా అడుగులు లెక్కపెట్టుకుంటూ హర్ హైనెస్ తలవద్దకుపోయి 'యువర్ హైనెస్!' అని బిగ్గరగా పిల్చాడు.

ఆ పిలుపుతో హిజ్ హైనెస్‌కు ఒళ్ళుమండింది. తల పైకెత్తి ఏవగింపుతో సాకీ వంక చురచుర చూచి మళ్ళీ రాణి పరిచర్యలో లీనమయ్యారు.

'యువర్ హైనెస్! నాదొక మనవి వుంది, తమ రిది వినితీరాలి.' అన్నాడు తిరిగి సాకీ అతిగంభీరంగా. వారు మళ్ళీ తలయెత్తి అతనివంక చూచారు. హర్ హైనెస్ కూడా ఒకపర్యాయం కళ్ళు విప్పి చూచింది.

'హుజూర్ వారు వీరిని తీసుకొనివెళ్ళటానికే దయ చేశారా!' హర్ హైనెస్‌ను చేత్తోచూపిస్తూ అడిగాడు సాకీ. వాడి స్వరంలో కర్కశత్వం యిమిడివుంది. వారది గ్రహించి లేచి నిలబడి 'ఏమిటి నీవుద్దేశం?' అని గద్దించారు. సాకీ అట్టహాసంచేస్తూ నవ్వాడు.

'నావుద్దేశమా? నావుద్దేశంతో హుజూరువారి కేం పని? నామనవి చిత్తగించి జవాబిచ్చి ఈదాసుణ్ని కృతార్థుని చేయండి.'

వాని ముఖవైఖరిలో, స్వరంలో, మాటల్లో వెర్రితనం కన్పిస్తోంది. హిజ్ హైనెస్ సాధికారంగా అన్నారు–'మా సన్నిధినుంచి తొలగిపో. ఇది మాఆజ్ఞ.' సాకీ ఫకాలున నవ్వి 'ప్రభువువారి యాజ్ఞ శిరోధార్యం; కాని, యీ గులాము చేసిన తప్పు?'

హిజ్ హైనెస్ రోషకషాయితనేత్రులై 'ఛీ, నీతో మేముమాట్లాడము, ఫో' అన్నారు. సాకీ మొండిగా 'అయితే సర్కారువారు ఇంతదూరం శ్రమపడి నిష్క్రైతుకంగానే దయ చేశారా?' అన్నాడు.

హిజ్ హైనెస్‌కు ఒంట్లో కంపరంపుట్టింది. తీవ్రంగా సాకీవంక చూచారు. ఇద్దరి చూపులు ఢీకొన్నవి.

'ఏమన్నావ్?'

'ఏమీ లేదు! మహారాజాగారు నిరాశతో తిరిగి పోవాలే అంటున్నాను. ఇక మేము సిద్ధంచేసుకున్న ప్రయాణం సాగించాలి. జాగవుతోంది. మమ్మల్ని మా గతికివదలి తమరు దయచేస్తే మంచిదని మనవి చేసుకుంటున్నాను.'

'మమ్మల్ని!' ఈ మాటలు రెట్టిస్తూ హిజ్ హైనెస్ 'నువ్వు వెళ్ళిపోవచ్చును సాకీ. నిన్ను పట్టుకుంటానికి రాలేదు మేము.' అన్నారు.

'చిత్తం; కాని తమరు వీరిని తీసుకుని వెళ్ళటానికే నిశ్చయించుకున్నారా?' అప్పటికి హర్ హైనెస్‌కు పూర్తిగా తెలివివచ్చింది. వారి సంభాషణలో తుదివాక్యం చెవిని పడింది. వెంటనే లేచి కూచుంది.

'అవును, ఈమెను క్షమాపణకోరి తీసుకువెళ్ళటానికే వచ్చాము.' దీనికి ప్రత్యుత్తరంగా సాకీ పైశాచికాట్టహాసం చేస్తూ బిగ్గరగా నవ్వాడు. ఆ నవ్వు ఆ కొండలోయలో ప్రతిధ్వనించింది.

రివాల్వరు మరొకసారి అతని హస్తాన్ని అలంకరించింది.

## 26

సాకీ చేతిలో రివాల్వరుచూచి హర్ హైనెస్ భయభ్రాంతమై కెవ్వుమని అరచింది. చంద్రకాంతుడును గాభరాపడ్డాడు.

హర్ హైనెస్ తత్తరపాటుతో చివాలున లేచినిలబడ్డది. సాకీ చేతిలోని రివాల్వరును గుంజ లాక్కోవాలని ఆమె యత్నం. ఆమె వుద్దేశం పసికట్టి 'హుజూర్! క్షమించాలి. నావుద్దేశం కాల్చాలని కాదు.' అని సాకీ ఒక అడుగు వేశాడు. ఆమెకళ్ళల్లోకి చూస్తూ అన్నాడు – 'యువర్ హైనెస్! తమరు యిచ్ఛాపూర్వకంగానే నన్ను వదలి వెళ్ళి పోదలచితే నాప్రాణం యిప్పుడే మీచరణసన్నిధిని త్యజించి వేస్తాను.' ఆమె మాట్లాడలేదు. 'చెప్పండి హుజూర్! తమ రేమి నిశ్చయించుకున్నారు? ఇద్దరిలో తమకిష్టమున్నవారినే ఎంచుకోండి ... ఒకవిధంగా నిశ్చయించుకుంటే ఒకరు ప్రాణం త్యజించక తప్పదు. మరొకవిధమైన నిర్ణయానికొస్తే ఎవరికీ యెటువంటి హానీ వుండదు.'

ఆమె నఖ–శిఖ పర్యంతం కంపించిపోయింది. నోట మాట పెగలటంలేదు. హిజ్ హైనెస్ మరి మిన్నకుండలేక పోయారు. వారిలో అంతర్హితమైయున్న రాజదర్పం పైకుబికి వచ్చింది.

'ఇంతకూ నీ వుద్దేశమేమిటని' సాకీని తమ ఆధిక్యత చూపిస్తూ అడిగారు.

'హుజూర్ వారిపట్ల నా గౌరవ మిప్పటికీ అట్లాగే నిలచి వున్నది.'

'అంటే?'

'అంటే ఏముంది. ప్రాణంతో చెలగాటమాడటానికి సిద్ధంగా వుండటమే.' వారి క్రోధానికి కట్ట తెగింది. చేయి జేబులో కెళ్ళింది. అంతలో సాకీ రివాల్వరును వారికి గురి

పెట్టి హెచ్చరించాడు-'ఆ ప్రయత్నం విరమించండి. అంత పని అవసరంలేదు లెండి.'

హిజ్ హైనెస్ సాకీ మనోభావాన్ని గ్రహించలేక పోయారు. చెయ్యిమాత్రం టక్కున ఆగిపోయింది.

'అధైర్యపడకండి. మన యిరువురి ఘర్షణకూ కారణ భూతులైనవారికే ఈ తీర్పును వదలటం వుత్తమం. ఈ ఘోరాటవిలో, కొండలోయల్లో, నిర్మానుష్య ప్రదేశంలో తమ రాజ్యమూ లేదు, అధికారమూలేదు. తమరు యిష్ట పడితే యిక్కడ జరిగింది యెవరికీ తెలియదుకూడాను. తమ నిశ్చయాన్ని మార్చుకొని యథాప్రకారం సాఫీగా జరుగ నివ్వండి. ఈ సేవకుని సలహా...' తన్నే తీర్పుచెప్పమని సాకీ కోరటంవల్ల తనస్థితి క్లిష్టమైందని గ్రహించింది. హర్ హైనెస్. భర్తకు సాకీకి ఘర్షణజరగటం, వ్యవహారం విషమించటం మంచిదికాదని మధ్యలోనే అందుకున్నది—

'సాకీ! విను, నామాట విను.' సాకీచెయ్యి క్రిందికి వాలింది.

'విను సాకీ, నా నిమిత్తం మళ్ళీ ఖూనీచెయ్యవలసిన అగత్యంలేదు.'

సాకీకి ఆతుత్రత హెచ్చింది.

'నేను బాగా ఆలోచించాను. వెనక్కితిరిగి వెళ్ళిపోవ టానికే నిశ్చయించాను...' సాకీ నెత్తిమీద పిడుగుపడ్డట్ట యింది. ముఖంలో నెత్తురుచుక్కలేదు. చేతిలోని రివాల్వరు జారిపోతోంది. కాళ్ళక్రిందినేల కుంగిపోతున్నట్టనిపించింది సాకీకి. 'ఏమిటి?' అని అడిగాడు తడబడుతూ.

'నేను తిరిగి వెళ్తాను. నువ్వుకూడా నాతో రా. నీవిష యంలో బాధ్యత...'

సాకీ ఆమె నిక మాట్లాడనివ్వలేదు.'ఏమిటి హుజూర్! తమరు వెళ్తారా? ఎవరిపేరు వినటానిక్కూడా అసహ్యించు కొనేవారో, ఎవరిగృహం చీకటికొట్టనీ, చెరకంటె ఘోరమనీ యీసడించారో వారి అంతఃపురానికే మళ్ళీ వెళ్తారా?...'

ఆవేశంతో చెప్పుకుపోతూంటే హర్‌హైనెస్ 'ఆపు, ఆపు. నామాట విను. నీసేవ మరువను. నీకెట్టి ప్రమాదం జరుగకుండ నాది పూచీ,నావెంట రా. నిన్నుకాపాడేభారం నాది. నావద్దనే వుందువుగాని.'

'సాకీని సమాధానమీయనివ్వకుండానే'అలాజరుగదు, జరగటానికి వీల్లేదు నే నీ నీచుణ్ని, కృతఘ్నుణ్ణి, హంత కుణ్ని మనతో రానివ్వను.' అంటూ హిజ్‌హైనెస్ రెప్ప పాటులో పిస్తోలుతీసి సాకీ పైకి దూకారు.

సాకీ అలా జరుగుతుం దనుకోలేదు. అందుకు సిద్ధంగా కూడా లేదు.

అప్పు డొకతమాషా జరిగింది. ఒకవైపునుండి రఁయ్ రఁయ్‌మంటూవచ్చి ఒకగుండు సాకీచెవిని దూసుకుపోయింది. దూరాన రివాల్వరు ప్రేల్చినధ్వని యెల్లరి గుండెల నదర గొట్టింది. హిజ్‌హైనెస్‌పిస్తోలునుండికూడా పొగవచ్చింది; కాని వారిగురితప్పింది. సాకీరివాల్వరు మాత్రం క్రింద పడిపోయింది.

నిరాశాసంత ప్తహృదయంతో సాకీ ముందుకు దృష్టి సారించాడు. ఒక జట్టుతో తెల్లదొర ఒకడు అక్కడికే వస్తున్నాడు. తెల్లవానిచేతిలో రివాల్వరువుంది. అతడు వదలినగుండే తనచెవిని దూసుకుపోయిందని సాకీ తెలుసుకున్నాడు. హర్ హైనెస్‌మాటలతోనే అతడు జీవచ్ఛవమయ్యాడు. ఇప్పుడిక ఆయుధం కూడా జారిపోయింది. వస్తూనే రివాల్వరు కాల్చిన దొరవైపు అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు. హిజ్ హైనెస్ కూడా మళ్ళీ సాకీపై ఆక్రమణకు ఉపక్రమించలేదు.

సాకీ తన కిక మృత్యువు దాపురించిందనుకున్నాడు. అయినా ప్రాణంమీదితీపిపోలేదు. ఆలోచించటానికి అవకాశంలేదు. రెండోదిక్కుకు పరుగెత్తసాగాడు. 'పోనివ్వొద్దు. పట్టుకోండి.' హిజ్ హైనెస్ తమకూడా వచ్చిన నౌకరులను హెచ్చరించారు.

పరిస్థితి విషమించింది. హర్ హైనెస్ మెల్లగ హిజ్ హైనెస్ భుజంమీద చెయ్యివేసి 'పాపం! పోనివ్వండి.' అంది దీనంగా.

చంద్రకాంతు డదివిని నౌకరులను 'వెంబడించవ'ద్దని కేకవేశాడు.

ఇంతకుముందు హిజ్ హైనెస్ సాకిపైకి లంఘించినప్పుడు సాకీకి గురిపెట్టి కాల్చిన దొర మరెవ్వరో కాదు, వాషింగ్టన్! ఎలాగో కూపీతీసి హంతకుని జాడకనుక్కొని వచ్చాడు. సాకీ పారిపోవటం చూచి తనవెంటవచ్చినవారిని సాకీ ననుసరించమని ఆదేశించి తాను కుటీరంవద్దనున్న

జనాన్ని కలుసుకున్నాడు. రాజా, రాణీ లిద్దరికి టోపీతీసి అభివాదంచేశాడు. అతడు వీరందరినీ ఎరుగును; కాని, వీరాతని నెరుగరు.

చంద్రకాంతుడు వివరాలడగబోయేసరికి వాషింగ్టన్ 'ఇప్పుడేవస్తా' నంటూ సాకీ పరుగెత్తిన దిక్కుకు చకచకా నడచి వెళ్ళాడు.

సాకీకి ప్రాణంమీద కొచ్చింది. దారీ తెన్నూ చూడకుండా పరుగుతీస్తున్నాడు. ఎదురుదెబ్బలుతగిలినా గమనించే అవకాశంలేదు. ప్రాణంతో పట్టుబడకూడ దనుకున్నాడు. రివాల్వరు చేతిలోవుంటే ఏం చేసేవాడో, కాని గత్యంతరం లేక పలాయనంచేయనలసివచ్చింది.

పర్వతాగ్రంమీదికి చేరుకున్నాడు సాకీ. వాషింగ్టన్ అనుచరులు శక్తికి మించిన వేగంతో వెంబడించి తరుముకొచ్చాడు. హర్ హైనెస్ వగైరాలు రెప్పవాల్చకుండా చూస్తున్నారు. పర్వతశిఖరాన్ని చేరుకొనేవరకూ సాకీ అందరికీ కన్పిస్తూనే వున్నాడు తర్వాత ఒక పెద్ద కేక విన్పించింది. అంతే, మళ్ళీ సాకీ ఎవరికీ కన్పించ లేదు.

కేక విన్నప్పుడు అందరి గుండెలు ఝల్లుమన్నాయి. తర్వాత కొద్దిసేపటికే సాకీ ఆఖరుసారి కన్పించిన తావుకు వాషింగ్టన్ వగైరాలు చేరుకున్నారు. కొంతసేపటివరకూ చుట్టుప్రక్కల గాలించి వెతికారు. కాని, సాకీ అంతుచిక్క లేదు. మరి కొంతసేపు వెదకుమని అనుచరులతో చెప్పి వాషింగ్టన్ వచ్చేశాడు. అతను రాగానే చంద్రకాంతుడు 'ఏమైంది?' అని అడిగాడు. 'అయిపోయాడు!' వాషింగ్టన్

విచారపూర్వకంగా చెప్పాడు—'ఫ్రూర్ ఫెలో! అగాధంలో పడిపోయివుంటాడు.'

హర్ హైనెస్ కనుకొలకుల్లో చేరిన కన్నీటిబిందువులు అక్కడే యిగిరిపోయాయి. నాకీదుర్గతిచే దుఃఖరూపంగా వచ్చిన కన్నీటిచుక్కలను చేత్తోతుడుచుకొని సానుభూతిని ప్రకటించటానికైనా ఆమె సాహసించలేకపోయింది.